సంపాదకీయం.......

**అందరికీ నమస్కరించి........**

**భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారి దివ్యాశీస్సులతో,** శ్రేయోభిలాషుల సహాయ సహకారములతో, పాఠకుల ఆదరాభిమానములతో, క్రమం తప్పకుండా, ప్రతినెలా సకాలంలో 'శ్రీవాణి' పాఠకులకు అందించబడుతున్నది 'శ్రీవాణి' 15 సంవత్సరములు పూర్తిచేసుకొని, 16వ సంవత్సరములో అడుగు పెట్టింది. ఇది 181 వ సంచిక రాష్ట్రస్థాయిలో రెండుసార్లు విశిష్ట ఉత్తమ అవార్డులను పొందడమేకాక, పలు పర్యాయములు సన్మాన సత్కారములను కూడ అందుకొనినది 'శ్రీవాణి'

నైతిక, ధార్మిక , ఆధ్యాత్మిక విలువలకు తిలోదకాలిస్తున్న ఈ తరుణంలో, ఎల్లో జర్నలిజం పరవళ్ళు త్రొక్కుతున్న ఈ సమయంలో, సెక్సు సాహిత్యం విశృంఖలంగా విలయతాండవం చేస్తున్న ఈ దుర్దినాలలో, నవలా సాహిత్యం పై మోజు పెట గుతున్న ఈ రోజులలో , డిటెక్టివ్ సాహిత్యంపై అభిరుచి పెంచుకుంటున్న ఈ కాలంలో , కధలు, సీరియల్స్‌తో, కలుషిత రాజకీయాలతో పాఠకులు కాలక్షేపం చేస్తున్న ఈసమయంలో, అర్ధనగ్న దృశ్యాలతో, సినిమాతారల బొమ్మలతో పత్రికలు దర్శనమిస్తున్న ఈ సంధి కాలంలో - వీటన్నిటికీ ప్రాధాన్యత ఇవ్వకుండా, కేవలం సాహిత్య, సాంస్కృతిక,ఆధ్యాత్మిక, విద్యా, విజ్ఞాన విషయములకే ప్రాముఖ్యత ఇస్తూ పత్రికను నడపటం సాహసమే అవుతుంది అయినప్పటికీ ఏమాత్రం రాజీపడకుండా, ఉత్తమ ఆశయ ఆదర్శములను విడనాడకుండా, పవిత్రమైన ఉత్తమ విలువలను పోషించుకుంటూ, నష్టములను చవిచూస్తున్నా, వెనుకంజవేయక, గత 15సంవత్సరాలుగా, ప్రతినెలా పాఠకులకు సకాలంలో అందించబడుతున్నది 'శ్రీవాణి'

"శ్రీవాణి"ని ఎంతోమంది ప్రముఖులు ప్రశంసిస్తున్నారు, విజ్ఞులు మెచ్చుకుంటున్నారు కాని, ఇవ్వవలసినంత సహకారం మాత్రం అందించలేకపోతున్నారు శ్రీవాణికి న్యూస్‌ప్రింట్ కోటా లేదు ప్రభుత్వ ప్రకటనలు అసలే లేవు వ్యక్తులూ, సంస్థలూ ఇచ్చే ప్రకటనలు కేవలం రెండూ లేక మూడు మాత్రమే . అయితే చందాదారుల అభిమానం మాత్రం మంచిగా ఉన్నదనే చెప్పాలి అయితే సర్క్యులేషన్ కూడా పెరుగవలసిన స్థాయిలో మాత్రం పెరుగటంలేదు. అందువలననే ఉత్తమ ఆశయ ఆదర్శములుగల పత్రికలు ఈ సంధియుగంలో నిలబడలేకపోతున్నాయి **అయినప్పటికీ భగవాన్ సాయి దివ్యాశీస్సులు నిండుగా, దండిగా ఉండడం వలన 'శ్రీవాణి' మాత్రం ఇంతకాలంగా నిర్విఘ్నంగా నడుస్తున్నది.** టకేవలం దైవ 'కృప' మాత్రమే సరిపోదు. దైవ 'కృప'తోపాటు మానవ 'కృషి' కూడ ఉండాలి 'కృషి, కృప' - ఈ రెండూ ఉన్నప్పుడే ఆశించిన ఫలితాలు చేకూరుతాయి.

కనుక కేవలం 'శ్రీవాణి' యెడల ప్రశంసల జల్లులు కురిపించినంత మాత్రమున ప్రయోజనం ఉండదు, అయితే ఆ ప్రశంసలు పత్రికా నిర్వాహకులకు కొంత ఉత్సాహాన్ని మాత్రం ఇస్తాయి. ఆ ఉత్సాహానికి తగిన ప్రోత్సాహం కూడా తోడైనప్పుడు ఆశించిన విధంగా ఫలితాలు వస్తాయి కనుక **"శ్రీవాణి' బాగున్నది, ఉండవలసిన పత్రిక"** అని భావించేవారికి ఒక చిన్న మనవి చేయదలచాను ప్రతి చందాదారుడు కనీసం ఒక క్రొత్త చందాదారుని చేర్పించితే చాలు మనకు నచ్చిన పత్రికకు ఈ మాత్రం సహాయం చేయలేమా? సహృదయంతో ఆలోచించండి. మంచిని ప్రోత్సహించండి ఆ మంచిని పదిమందికి పంచడానికి సహకరించండి మంచిని తానే అనుభవించాలనుకుంటే స్వార్థమవుతుంది పదిమందికి పంచటంలోనే ఉన్నది పరమార్ధం కనుక ఉత్తమ విలువలను పోషిస్తున్న శ్రీవాణికి మరింత ఉత్సాహ ప్రోత్సాహములనిచ్చి, పదికాలాలపాటు శ్రీవాణి నిర్విఘ్నంగా నడవడానికి అవసరమైన సహాయ సహకారములు అందించుతారని ఆశిస్తున్నాను, భావితరాలవారికి ఉత్తమ సాహిత్యాన్ని అందించే అవకాశం కల్పిస్తారని విశ్వసిస్తున్నాను

**ధన్యవాదములు**

సదా సాయి సేవలో

(కొమరగిరి కృష్ణమోహనరావు)

జనవరి 2000

సంపుటి 16 సంచిక 1

# శ్రీవాణి

## సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకులు : కొమరగిరి కృష్ణమోహనరావు

మేనేజర్
**కొమరగిరి చంద్రశేఖర్**
24-52, రామానాయుడుపేట,
మచిలీపట్నం - 521 001.
© 22818, 21137

Cheques & Drafts should be drawn in favour of "*SREEVANI*" Monthly Machilipatnam

Edited, Printed and Published by
***Komaragiri Krishna Mohan Rao***

| | | |
|---|---|---|
| సాధారణ సంచిక | : | 5-00 |
| సంవత్సర చందా | : | 60-00 |
| 4సం॥ల చందా | : | 225-00 |
| జీవిత సభ్యత్వం | : | 600-00 |
| పోషకులు | : | 1,116-00 |
| రాజపోషకులు | : | 5,116-00 |
| మహారాజపోషకులు | : | 10,116-00 |
| ఓవర్‌సీస్ చందా (4 సం॥లకు) | : | 50 $ |

*Printed at*
**SREEVANI OFFSET PRINTERS**
MACHILIPATNAM

*Despatched on*
**7-01-2000**

## విషయసూచిక



ముఖచిత్రం : మహోన్నత వైద్యశాస్త్రవేత్త **డా॥ యల్లాప్రగడ సుబ్బారావు**



# పురుష సూక్తము

7

సప్తాస్యా సన్ పరిధయః
త్రిస్సప్త సమిధః కృతాః
దేవా యద్యజ్ఞం తన్వానాః
అబధ్నన్ పురుషం పశుమ్ ॥

అర్థం :

| | |
|---|---|
| యత్ యజ్ఞమ్ | : ఏ యజ్ఞాన్ని |
| తన్వానా | : విరివిగా చేయుటకు |
| దేవాః | : దేవగణాధిపతులు |
| పశుమ్ | : పశువైన |
| పురుషమ్ | : లౌకిక పురుషుని |
| అబధ్నమ్ | : నియమబంధితుణ్ణి చేస్తున్నారో |
| అస్య | : ఆ యజ్ఞ విధికి |
| సప్తపరిధయః ఆసన్ | : ఏడు ఆవరణలున్నాయి. |
| త్రిః సప్తః | : మూడేళ్లు ఇరువదొక్క |
| సమిధః కృతాః | : ఇంధనాలు కూర్చబడినాయి |

వ్యాఖ్య:

ఈ జగత్సృష్టి ఒక మహాయజ్ఞం. ఈ యజ్ఞం పరమేశ్వర దివ్య సంకల్పం. దేవతలు ఈ యజ్ఞ కార్యకర్తలు. అన్ని జీవులు పశువులు. పురుషుడు పశుతుల్యుడు. ఈ పశుతుల్యుని ఉత్తమ పురుషుణ్ణి చేయాలి. అందుకే ఈ మహాక్రతువు. ఈ యజ్ఞ క్రియ ద్వారా పురుషుడిలో కొన్ని అపూర్వ శక్తులు నిబద్ధం చేయాలి.

మహర్షుల తపః ఫలంగా దేవతల కార్యఫలంగా పశువు వంటి పురుషుడు యజ్ఞపురుషుడుగా యజ్ఞ పురుషుడు పురుషోత్తముడుగా ప్రవర్ధమానుడు అవుతాడు. ఈ యజ్ఞానికి ఏడు ఆవరణలు ఇరువ దొక్క సమిధలున్నాయి. అవి ఇలా వివరించుకోవాలి.

యజ్ఞకర్మకు యజ్ఞశాల, ఏడు ఆవరణలు, ఇరువ దొక్క సమిధలు అవసరం. పురుషుడంతర్యామి. పురుషుని దేహమే యజ్ఞశాల. దేహోపకరణాలు సమిధలు. సమిధలే పరిధులు. సప్తధాతువులు సప్తఆవరణలు. జీవుడు పురుషుడి అంశయే. తత్త్వపరిభాషలో త్రిస్సప్త సమిధలు తత్త్వ పరిధులు. భౌతిక సృష్టి ఏడు, మానసిక ఏడు, దివ్యసృష్టి ఏడు కలిసి ఇరువదొకటి. ఇవి ఈ యజ్ఞ సంస్కార సంభారాలు.

**జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రి**

గాయత్రీ ఛందస్సులు ఏడు. ఇవి వేద గమన విధానాలు. పరిధులు, అగ్నులు మూడు (ఆహితాగ్ని, దక్షిణాగ్ని, ఆహవనీయాగ్ని), ఆదిత్యుడు సప్తహయ ప్రభువు ఆత్మ ఉత్తర వేదికలు మూడు. వెరసి ఏడు. ఇది సృష్టి యజ్ఞం. ఫలం పురుషుడు యజ్ఞపురుషుడగుట. 'యజ్ఞో వై సంవత్సరః' అని. మానవ జీవితం సంవత్సర స్వరూప మండలాత్మకం. ఇందు నిత్యం వ్యయమయ్యే కాలాదులు సమిధలు. కాల పురుషుడికి సంవత్సర పరిధిలో ద్వాదశ ఆదిత్య జ్యోతులు ద్వాదశ మాసాలు. ఋతువులు ఆరు. స్వర్గ మర్త్య పాతాళలోకాలు మూడు. ఇవి మొత్తం ఇరువదొకటి. సర్వ ప్రభువు అసావాదిత్యుడు. జీవ పరిభాషలో జీవునికి ఏడు ఆవరణలు, ఏడు ధాతువులు. దేవ పరిభాషలో- పంచభూతాలు - పంచతన్మాత్రలు - పంచ జ్ఞానేంద్రియాలు. పంచకర్మేంద్రియాలు మనస్సు - ఇరువదొకటి.

భూతపరిభాషలో - పంచ భూతాలు అహంకారం, బుద్ధి 7 x 3= 21. ఇవి నాల్గుదిక్కుల మధ్య ఉన్నాయి. ఇలా అన్వయించిన అతి సూక్ష్మ విషయాలు స్ఫురిస్తాయి. ⁘



# మహోన్నత వైద్యశాస్త్రవేత్త డా॥ యల్లాప్రగడ సుబ్బారావు

'ముహూర్తం జ్వలితం శ్రేయః న తు ధూమాయితం చిరమ్'

'చాలా కాలం పొగలాగా ఉండడం కన్నా ఒక క్షణ కాలమైనా వెలుగు వెలగడం మంచిది' అన్న మహాభారత సూక్తికి సజీవ తార్కాణం మహోన్నత వైద్యశాస్త్రవేత్త డా॥ యల్లా ప్రగడ సుబ్బారావు. "సమయం ఎంతో విలువైనది రోగగ్రస్తులైన సహోదరులు మృత్యుకోరల్లో చిక్కకుండా వారిని రక్షించాలి. అలా రక్షించి వారికి సుఖం కలుగ జేయటం మన అందరి ధర్మం" అంటూ తన నిరంతర పరిశ్రమతో ప్రాణాంతకమైన, మానవ జాతి మనుగడకే ప్రశ్నార్ధకంగా నిల్చిన ఎన్నో వ్యాధులకు నివారణోపాయము లను కనుగొని మానవాళికి మహోపకారము నొనర్చిన వైద్యశాస్త్ర నిపుణుడు, అపర ధన్వంతరి డా॥ యల్లాప్రగడ సుబ్బారావు. బీదరికంలో పుట్టి అకుంఠిత దీక్షతో, కఠోర పరిశ్రమతో భీమవరం నుండి బోస్టన్‌చేరి తన జీవితాన్ని వైద్యశాస్త్రానికి అంకితం చేసిన తెలుగుజాతి మేలిరత్నం డా॥ యల్లా ప్రగడ. ఒకప్పుడు ప్రాణాంతకంగా నిలచిన 'స్ప్రూ' వ్యాధి నేటి తరానికి తెలియకుండా పోవటానికి కారణం సుబ్బారావే. ఇక ఆయన తను కనుగొన్న మందుల ద్వారా, మానవాళికి చేసిన సేవలు మరువలేనివి.

1895 జనవరి 12న పశ్చిమగోదావరి జిల్లాలోని భీమవరంలో ఒక బీదకుటుంబంలో యల్లాప్రగడ సుబ్బారావు జన్మించాడు. తండ్రి జగన్నాధం రెవిన్యూ ఇనస్పెక్టరుగా పదవీవిరమణ చేయడంతో కుటుంబం ఆర్ధిక ఇబ్బందులతో సతమతమవుతుండేది. పాఠశాలలో విద్యాభ్యాసం సుబ్బారావుకు భరించలేనంత భారంగా తోచేది. తరచు తరగతులకు గైర్హాజరు అవుతుండేవారు. పుణ్యక్షేత్రమైన కాశీలో అరటిపళ్ళు అమ్మితే లక్షల రూపాయలు సంపాదించవచ్చు, ఇహం, పరం సిద్ధిస్తాయని ఇంట్లో ఎవరికీ చెప్పకుండా కాశీ ప్రయాణమయ్యారు. కానీ అతని తల్లి వెంకమ్మ ఆ యత్నాన్ని వమ్ము చేసింది. 1911లో సుబ్బారావు మెట్రిక్యులేషన్ పరీక్షలో ఫెయిలు అయ్యారు. అందువలన ఆయన విద్యాభ్యాసం రాజమండ్రికి మారింది. కానీ అక్కడా ఆయన మెట్రిక్యులేషన్ గండం గట్టెక్కలేదు. ఆయన తండ్రి కన్నుమూసినా, తల్లి ప్రోద్బలంతో పట్టుదల పెరిగి మద్రాసు హిందూ హైస్కూలులో చేరి, ఇక ఆ తర్వాత వెనుతిరిగి చూడకుండా విద్యాభ్యాసం కొనసాగించారు. ఇంటర్మీడి యెట్‌లో ఆయనకు గణితంలో 'డిస్టింక్షన్' వచ్చింది. అంతా ఆయనను గణితంలో ఆనర్స్ చదవమని ప్రోత్సహించారు. కానీ సుబ్బారావు మాత్రం యం.బి. బి.యస్. చదివి డాకరయి రామకృష్ణ మిషన్‌లో సన్యాసిగాచేరి

**కొమరగిరి మాధవీశ్యామ్**

సేవలందించాలని కలలుకన్నారు. అదే జరిగి ఉంటే ఒక గొప్ప వైద్యశాస్త్రవేత్తకు బదులు గొప్ప ఆధ్యాత్మికవేత్తగా ఆయ.ను జాతి గుర్తించి ఉండేది. తల్లికాదని పట్టుబట్టడంతో తన కోరిక విరమించుకొని మద్రాసు మెడికల్ కాలేజీలో చేరి మెడిసన్‌పై దృష్టిని నిలిపారు. సుబ్బారావు ఆర్థిక ఇబ్బందుల నెదుర్కొంటూ మెడిసన్ చదువు ఆగిపోతుందేమోనని అనుకుంటున్న సమయంలో అనపర్తికి చెందిన కస్తూరి వారి కుటుంబం సాయంచేసి ఆదుకున్నది. ఇందుకుగాను ప్రతిఫలంగా వారి అమ్మాయి శేషగిరిని సుబ్బారావు వివాహం చేసుకున్నారు.

వైద్యశాస్త్ర అధ్యయనంతో పాటు దేశభక్తి, జాతీయ భావాలు కూడా కలిగిన వ్యక్తి సుబ్బారావు. గాంధీజీ సహాయ నిరాకరణోద్యమంతో ప్రభావితుడైన ఆయన విదేశీ వస్త్రాలను బహిష్కరించి ఖద్దరు ధరించి కాలేజీకి వెళ్ళారు. ఫలితంగా శ్వేతజాతీయుడైన సర్జరీ ప్రొఫెసర్ ఆగ్రహానికి గురై, ఎం.బి.బి.యస్.లో అన్ని సబ్జక్టులలో మంచి మార్కులతో పాసై, సర్జరీలో మాత్రం బొటాబొటి మార్కులతో పాసయ్యారు. అయితే పరిశోధనలలో తలమునకలవుతున్న సుబ్బారావు ఆ విషయాన్ని పెద్దగా పట్టించుకోలేదు. పై చదువుల నిమిత్తం అమెరికా వెళ్ళాలని నిశ్చయించుకొని ప్రయత్నాలు మొదలుపెట్టారు సుబ్బారావు.

విధి చాలా విచిత్రమైనది. అప్పుడప్పుడు కొందరి బాధ ఇంకొకరికి ఆనందాన్ని ఇస్తుంది. కొందరి కష్టం ఎందరికో సుఖాన్ని అందిస్తుంది. అటువంటి సంఘటనే యల్లాప్రగడ సుబ్బారావు గారి జీవితంలో జరిగింది. అనుకోకుండా సుబ్బారావు పెద్ద అన్నయ్య పురుషోత్తం భయంకరమైన స్ప్రూ వ్యాధి బారినపడ్డాడు. అప్పట్లో 'స్ప్రూ' వ్యాధి ప్రాణాంతకమైన వ్యాధి. బతికి బయటపడటం అసాధ్యం అనుకునేవారు అందరూ. పురుషోత్తం ఆరోగ్యం క్రమంగా క్షీణించి, 'స్ప్రూ' వ్యాధితో మరణించాడు. ఈ విషాద సంఘటన నుండి సుబ్బారావు ఇంకా కోలుకొనక ముందే సుబ్బారావు మరో సోదరుడు కృష్ణమూర్తి కూడా 'స్ప్రూ' వ్యాధితో మరణించాడు. ఈ రెండు మరణాలు సుబ్బారావును తీవ్రమైన మనోవేదనకు గురిచేశాయి. ఎలాగైనా స్ప్రూ వ్యాధికి మందు కనిపెట్టాలని ఆయన దృఢంగా నిశ్చయించుకున్నారు ఒక విషయం గురించి శ్రద్ధ, దానిని సాధించాలన్న పట్టుదల, తపస్సులాంటి కృషి చేయగల కర్మ వీరుడు సుబ్బారావు. మామగారి కుటుంబం సహాయంతో ఆయన 1923లో కెనడాకు వెళ్ళారు. అక్కడ్నుంచి అమెరికాలో హార్వర్డ్ విశ్వవిద్యాలయంలో చేరారు. ఇక మళ్ళీ ఆయన భారతదేశం వైపు చూడలేదు. తన పరిశోధనలలో మునిగితేలుతుండిపోయారు. సుబ్బారావు వెళ్ళిన కొన్ని నెలలకు శేషగిరి మగబిడ్డను ప్రసవించింది. ఆ బిడ్డ తొమ్మిదినెలలే బ్రతికి సర్పి వ్యాధితో మరణించాడు. ఈ వ్యాధికి కూడ ఆ తర్వాతి కాలంలో సుబ్బారావే వాక్సిన్ కనుగొన్నారు. ఈ విధంగా ఆయన జీవితంలో విషాదం, ఎందరి జీవితాల్లోనో వెలుగునింపింది.

**'ఒకచో నేలను పవ్వళించు, నొకచోనొప్పారు పూసజ్జపై' 'లెక్కకు రానీయడు కార్యసాధకుడు కష్టంబున్ సుఖమున్ మదిన్'** అన్నట్లుగా అమెరికా వెళ్ళిన క్రొత్తల్లో ఆర్థిక ఇబ్బందులకు తలఒగ్గి, బోస్టన్‌లోని ఒక ఆస్పత్రిలో మూత్రశాలల్ని, పేషంట్ల బెడ్ పాన్లను శుభ్రం చేయటంలాంటి పనిలో చేరారు సుబ్బారావు. పగలంతా కాలేజీలో కష్టపడుతూ, రాత్రంతా పనిచేస్తూ, ఒక్కొక్క మెట్టే అధిగమిస్తూ, ప్రొఫెసర్ల మన్ననలందుకున్నారు. తన లక్ష్యసాధనపట్ల ఆయన పట్టుదల, కార్యదీక్ష అటువంటివి. 1924లో డాక్టర్ ఫిస్కే సాయంతో శరీర కణాల్లోని భాస్వరాన్ని సరిగ్గా, తేలిగ్గా నిర్ధారణ చేసే రేపిడ్ కెలోరిమెట్రిక్ మెథడ్ ను ఆవిష్కరించి, ప్రపంచానికి పరిచితులయ్యారు సుబ్బారావు. ఇదే ఫిస్కీ- సుబ్బారావు పద్ధతిగా పేరొందింది. 1930లో సుబ్బారావు హార్వర్డ్ మెడికల్ స్కూల్ నుండి పి.హెచ్.డి. పట్టా పొందారు. అదే సమయంలో శరీరంలో కండరాల శక్తికి మూలమయినది అడినోసిన్ ట్రైఫాస్ఫేట్ (ఎ.టి.పి.) అని నిర్ధారించి జీవశాస్త్రంలో నోబుల్ బహుమతిని పొందిన శాస్త్రవేత్తలను కాదని కొత్త అలజడిని సృష్టించారు.

సుబ్బారావు సాధించిన విజయాలన్నీ ఒక ఎత్తైతే, ఉష్ణమండల వ్యాధులు (Trophical Diseases) నివారించడానికి ఫోలిక్ యాసిడ్ విటమిన్‌ను కనుగొనడం, సుబ్బారావు జీవితంలో సాధించిన విజయాలన్నింటిలోకి అత్యున్నతమైనది. కాలేయం (Liver Extract)) టన్నుల కొద్దీ తెచ్చి పరిశోధనలుచేసి అష్టకష్టాలుపడి , అన్ని నిరుత్సాహాలను ఎదుర్కొని ఆయన ఫోలిక్‌యాసిడ్‌ను కనుగొన్నారు. దానితో సుబ్బారావు గారి కీర్తి ఆచంద్ర తారార్కమైంది. అది 20 వ శతాబ్దంలోనే వైద్యరంగంలో కనిపెట్టబడిన ఒక మహత్తరమైన మందుగా పరిగణించ బడుతున్నది. 'స్ప్రూ' వ్యాధి దీనివల్లనే అంతరించిపోయింది. ఈ విధంగా ఆయన ఎందరికో ప్రాణదానం చేసి "వైద్యో నారాయణో హరిః" అన్న సూక్తిని అక్షరసత్యం చేసారు.

తర్వాత ఆయన తన బృందం సాయంతో ఆర్యోమైసిన్ అనే మరొక అద్భుతమైన మందును తయారు చేశారు. విస్తృతంగా ఈనాడీ యాంటిబయాటిక్ మానవాళికి సేవలందిస్తోంది. బోదకాలు, ఇసినోఫిలియాల వంటి వ్యాధులకు ఉపయోగపడే హెట్రాజెన్, క్షయవ్యాధి నివారిణి 'ఇనోనెక్స్' కలరా, టైఫాయిడ్, ప్లేగు, అతిసారం తదితర వ్యాధిగ్రస్తులపాలిట కల్పతరువు టెట్రాసైక్లిన్, పిల్లలలో బ్లడ్ కాన్సర్‌ను అరికట్టే మెథాట్రెక్సేట్, అరియోమైసిన్‌లు ఆయన పరిశోధనల పర్వంలో కొన్ని అధ్యాయాలు మాత్రమే.

## మార్గదర్శి

తమను తొలగించి వెలుగుల తెరువ జూపు
జ్ఞాన మందించి సన్మార్గ కలిమి జూపు
విరిసి అభ్యాస వైరాగ్య విలువలిచ్చు
వాణి శ్రీవాణి శ్రీసత్యసాయివాణి

-కర్రి క్రిష్ణమ్మ

1940లో న్యూయార్క్‌కు చెందిన అమెరికన్ సయనమైడ్ కంపెనీవారి లెడర్లీ లాబరేటరీస్‌వారు సుబ్బారావు గారిని డైరెక్టర్ పదవికి ఆహ్వానించారు. వారి ఆహ్వానాన్ని అంగీకరించి, ఆ సంస్థకు సుబ్బారావు తన తుదిశ్వాస విడిచే వరకు సేవలను అందిస్తూనే వచ్చారు.

నిరంతరం నిశిత పరిశీలన, పరిశోధన, పట్టుదల, దీక్ష చెరగని ధైర్యసాహసాలు, మానవతా దృక్పథం సుబ్బారావులో కలగలసి ఉన్నాయి. మానవాళికి మహోపకారం చేసే మందులు ఆయన ఎన్నో ఆవిష్కరించారు. ఇంకా ఎన్నో కనిపెట్టాలని ఆరాటపడ్డారు. తన ఆరోగ్యాన్ని సైతం నిర్లక్ష్యం చేసారు. 'మరికొన్నాళ్ళు దేవుడు చల్లగా చూస్తే మనం మరో వ్యాధిని నివారించగలం' అన్న సుబ్బారావు 1948, ఆగష్టు 9న గుండెపోటుతో నిద్రాదేవి ఒడిలో నుండి మృత్యుదేవత ఒడిలోకి చేరుకున్నారు. ఆయన ఇంకొన్నాళ్ళు బ్రతికివున్నట్లైతే ఇంకెన్ని వ్యాధులకు మందులు కనుగొని వుండేవారో! ఈ శతాబ్దపు మేటి వైద్యుడుగా ఆయనను దేశవిదేశాలలోని వైద్యనిపుణులు, ఇప్పటికీ జ్ఞప్తికి తెచ్చుకుంటుంటారు. అమెరికన్ పత్రికలు ఆయనను వేనోళ్ళ కొనియాడాయి. అందుకే ఆయన చిరంజీవి అయ్యారు.

సనాతనభావాలకు, హైటెక్ సంస్కృతికి నడుమ వారధిగా నిలిచిన ఒక శతాబ్దకాలం కాలగర్భంలో కలిసిపోయింది. ఒకసారి చరిత్ర పుటలు తిరగవేస్తే, ఈ శతాబ్ద కాలంలో ఎన్నో జననాలు, ఎన్నో మరణాలు. అయితే శతాబ్దాలు గడుస్తున్నా, జాతి మరువని, మరువలేని రత్నాలు ఎన్నో కనపడ్తూనే ఉన్నాయి. ఓ మహాత్మాగాంధీ, ఓ మదర్ థెరిసా, ఓ వివేకానంద, ఓ సర్వేపల్లి, ఓ సుభాష్ చంద్రబోస్, ఓ యల్లా ప్రగడవారు, ఓ రామానుజం.... ఎందరో.... ఎందరెందరో... భౌతికంగా మన మధ్యలేరు. కాని వారి ఆశయాలు, ఆదర్శాలు ఈనాటికీ ఎందరికో స్ఫూర్తిని అందిస్తూ, వారి స్మృతులతో, ఆలోచనలతో మన మధ్య ఇంకా మిగిలేవున్నారు. వ్యక్తి క్షేమం కంటే సమాజ సంక్షేమం మిన్నగా భావించి అకుంఠిత దీక్షతో, నైతిక విలువలతో ఎంచుకున్న లక్ష్యసాధన దిశగా పురోగమించి భరతజాతి నిండుగౌరవాన్ని ఇనుమడింప జేసారు. కాబట్టే ఇంకా మన మధ్యవున్నారు, ఉంటారు. మరి వారి తరువాత తరాలకు చెందిన మనం వారి బాటలో ఎంత వరకు ప్రయాణిస్తున్నాము? 'సొంతలాభం కొంత మానుకొ పొరుగు వారికి తోడుపడవోయ్' అన్నారు గురజాడ. ఎంత వరకు ఆచరించగల్గుతున్నాము. పతనమౌతున్న ధార్మిక, నైతిక, ఆధ్యాత్మిక విలువల పునప్రతిష్ఠాపనకు ఈనాడు వీరజిజియాబాయి, పుతలీబాయిలవంటి ఆదర్శ మాతృమూర్తులు; సీత, సుమతివంటి సాధ్వీమణులు కావాలి. రామకృష్ణ పరమహంస వంటి గురువులు కావాలి. వివేకానందవంటి శిష్యులు కావాలి. అప్పుడే 'సుజలాం, సుఫలాం, మలయజ శీతలాం, సస్యశ్యామలం, మాతరం' అన్న కవి కలలు యదార్ధమౌతాయి.

## శ్రీవాణికి స్వాగతమ్

కదలి రండి! సాయిభక్తులారా!
తరలిరండి! సాహితీ ప్రియులారా!
బందరు వెళదాము
శ్రీవాణిని చూద్దాము

కృష్ణమోహనుని చేతిలో
పదిహేనేళ్ళ ప్రాయంతో ఎదిగి
షోడశకళలతో శోభిల్లి
చిన్న మాసపత్రికలరాణిగా నిలచింది

మానవతా విలువలే శ్వాసయై
సత్యసాయి వాణియే ఊపిరియై
ఉత్తమ సాహిత్యసేవే ప్రాణంయై
ప్రేమజ్యోతిగా వెలిగింది

కొమరగిరి వంశతేజమై
ఆధ్యాత్మిక కిరణాలతో
దేశవిదేశాలలో ప్రకాశిస్తూ
ఆత్మబంధువుగా హత్తుకుంది

సహస్రాబ్ది అడుగుల్లో
దశాబ్దిన్నరేళ్ళ కష్టాలు
సాయిమాత కరుణతో
కనుమరుగవ్వాలి

ఇరవైఒకటవ శతాబ్దిలో
(సు)విజ్ఞాన కాంతులు వెదజల్లే
సౌభాగ్యలక్ష్మితో వచ్చే శ్రీవాణికి
నిండుమనస్సుతో స్వాగతమిద్దాము

**- లోలభట్టు శ్రీనివాసరాజు, తూ॥గో॥ జిల్లా**

# సర్వాంతర్యామి...

సర్వశక్తి సంపన్నుడు, సర్వాంతర్యామి అయిన సర్వేశ్వరుడు ఎవరో, ఎలా ఉంటాడో, జీవులందరిపైన ఆయన అనుగ్రహం ఎలా ప్రసరిస్తుందో, వివరించాలన్నా, వర్ణించాలన్నా, మనకున్న భాష, పదాలు, పరిజ్ఞానం సరిపోవు!

సర్వేశ్వరుడు అనంతుడని , అక్షయుడని, లోక రక్షకుడని, శాస్త్రగ్రంధాలు పురాణేతిహాసాలు మనకు మార్గదర్శకత్వము చేస్తాయి. అంతేకాదు! ఏ శాస్త్ర గ్రంధాన్ని చూసినా, చదివినా పరమాత్ముడొక్కడేనని, పలువిధములైన నామాలతో, రూపాలతో పూజింపబడడం, కీర్తించబడడం జరుగుతోందని మనకు విశదమవుతుంది. ఆయన సర్వశక్తి మంతుడు. లోకమునంతకు వెలుగునిచ్చు సూర్యుని ప్రకాశము, చంద్రునియందు, అగ్నియందు కల ప్రకాశము ఆ భగవంతునివే! అనగా భగవంతుడు ఒక్కడే స్వయం ప్రకాశకుడు! ఆతని వెలుగు వలననే సూర్యచంద్రాదులు ప్రకాశింతురు.

అట్లే సమస్త జీవరాసుల దేహములందు జఠరాగ్ని రూపమున ఉండి, ప్రాణాపాన వాయువులతో గూడి ఆహారములను జీర్ణము చేయును. సర్వప్రాణులకు జ్ఞాపక శక్తి, వస్తుజ్ఞానము కలిగించును. అందుచేతనే సమస్త జీవులకు ఆ పరమాత్ముడే శరణాగతుడని సర్వులూ గ్రహించవలెను.

ఆయన సర్వాంతర్యామి కనుక ఆయన లేని తావు ఉండదు. అన్ని తావులూ ఆయనవే! అణువులోను నిక్షిప్తమై ఉంటాడు. బ్రహ్మాండమంతా నిండి ఉంటాడు. ప్రతి జీవిలోను, ప్రతిప్రాణిలోను ఆయన ఉంటాడు. అనంతకోటి జీవరాసులన్నీ ఆయన అంశాలే !ఈ సూక్ష్మ రహస్యాన్ని అర్థం చేసుకొని, అంగీకరించామంటే- ఆయన మనలో ప్రతిఒక్కరిలోను ఉన్నాడని విశ్వసించగలము. అలా విశ్వసించిననాడు, మన మధ్య పరస్పర ద్వేషం, ఈర్ష్య, అసూయ, క్రోధం వంటి దుర్గుణాలు నెలకొనే అవకాశమే ఉండదు. ఈ మతకల్లోలాలు, మారణహోమాలు మచ్చుకైనా కన్పించవు!

వెలుగుచున్న దీపపుకాంతి నలుదిక్కులకు ఎట్లు ప్రసరించునో, అట్లే సర్వేశ్వరుడు అన్నిదిక్కులా తానై ఉండును. మానవ చర్మచక్షువులకు ఆయన కన్పించక పోవచ్చునుగాని, ఆ భగవంతుని దృష్టి సోకని ప్రాణి ఏదీ ఉండదు. అందుకే ఆయన కంటబడకుండా మనమే కార్యమూ చేయలేము.

ఒక గురువుగారు ఇద్దరు శిష్యులను పిలిచి, చెరొక ఫలమును ఇచ్చి ఇతరుల కంట పడకుండ తినవలెనని చెప్పాడు! అందొక శిష్యుడు ఆ పండు పుచ్చుకొని దూరదూర తీరాలనున్న దట్టమైన అడవి మధ్యభాగానికి చేరాడు. చుట్టూ కలియజూసి, ఎవరూ చూడడంలేదని నిర్ధారించుకొని, ఆ ఫలమునారగించాడు. రెండవవాడు ఎక్కడకు పోయినను, తననెవరో వెంబడించి చూస్తున్నారనే భావనకు లోనై, తిరిగి తిరిగి ఆఫలమును భుజించకుండగనే మరలి వచ్చెను. దీనినిబట్టి జీవుల చర్యలనన్నిటిని ఆ భగవంతుడు పరికిస్తూనే ఉంటాడని మనం అర్థంచేసుకొనాలి!

## సోమంచి రామం

తన దివ్యస్వరూపమును చూపుమని అర్జునుడు ప్రార్థించగా, శ్రీకృష్ణుడు అసంఖ్యాకములగు దివ్యరూపము లను ప్రదర్శించెను. అనగా భగవంతునకొక రూపము లేదనియు, అవసరార్థము అనేక రూపములతో ప్రత్యక్షమై, విశ్వమంతయు వ్యాపించియుండునని గ్రహింపవలెను.

అసంఖ్యాకములగు ఆ రూపములన్నియు కలిసి, భగవంతుని విశ్వరూపమగును. అందుచేతనే భగవంతుడు విశ్వవ్యాపితుడు, సర్వాంతర్యామి!

### ఆణిముత్యాలు - అనుభవ సత్యాలు

1. ఋణశేషం, వ్రణశేషం, శత్రుశేషం ఉంచరాదు.
2) ఎంత పండినా కూటికే, ఎంత ఉండినా కాటికే.
3) కర్ణుడులేని భారతం శొంఠిలేని కషాయం ఒకటే.
4) కలిమి[illegible] పొంగరాదు. లేమికి కుంగరాదు.
5) కవితకు మెప్పు ఉండాలి, కాంతకు కొప్పు ఉండాలి.

# కన్నతల్లి ప్రేమకు మించినది లేదు

"సన్నజాజికన్న సంపెంగి లతకన్న
జున్నుగడ్డకన్న వెన్నకన్న
నెమలికన్నుకన్న నిండువెన్నెలకన్న
కన్నతల్లి ప్రేమ సున్నితంబు"

ప్రేమస్వరూపులారా!

ఈ చరాచర ప్రపంచమంతయూ ఒక శివతాండవము. దీనియొక్క అద్భుతము, ఆనందము, అగోచరము. ఇందులో రాత్రింబవళ్ళు, సుఖదుఃఖములు, చావు పుట్టుకలు- ఇవన్నీ ఈ తరంగములలో లలితకళలు. చావుపుట్టుకలు, ధర్మ అధర్మములు సహజమైనటువంటివి. ధర్మము అభివృద్ధి చెందునప్పుడు అధర్మము అడుగంటి పోతుంది. అధర్మము అభివృద్ధి చెందినప్పుడు ధర్మం అణిగి ఉంటుంది. ధర్మాధర్మములు రెండింటికినీ స్త్రీ పురుషులే మూలకారణం. మానవత్వంలో ఉన్న దివ్యత్వాన్ని గుర్తించు కోలేక, ప్రతిమానవుడు దివ్యత్వం, తన కంటే ప్రత్యేకంగా ఉన్నదని భ్రమిస్తున్నాడు. సుమతి సూర్యోదయాన్ని స్తంభింప జేసింది. సావిత్రి మరణగీతను తుడిచివేసింది. ఈ శక్తి మానవులకు ఎక్కడనుండి వచ్చింది? నిజంగా మానవుడు భక్తిప్రపత్తులతో ఆరాధనలు సలిపినపుడు సత్యం, శివం , సుందర స్వరూపాన్ని పొందుతాడు ఇట్టి మహత్తరమైన శక్తి మానవునియందు అంతర్భూతమై ప్రకాశిస్తున్నది.

కంసుడు తన సోదరియైన దేవకీదేవిని చంపుటకు సంసిద్ధుడైనాడు. భర్త అయిన వసుదేవుడు ఆమెను కాపాడటానికి ప్రయత్నించాడు. ఇతనిలో ఈ శక్తి సామర్థ్యములు ఎక్కడినుండి ఆవిర్భవించినాయి? ఇవన్నియూ మానవునియందు అంతర్భూతమై ఉన్నటు వంటి మహాశక్తులే. ఇవి ప్రత్యేకంగా సాధించేటటువంటివి కావు. మానవత్వాన్ని మరచి, దివ్యత్వాన్ని స్మరించినప్పుడు ఈ శక్తులు ఆవిర్భవిస్తాయి. కాని ఈ సత్యమును గుర్తించు కొనలేక, ప్రతిమానవుడు ఏదో ఒకరకమైన ఆరాధనలు సలుపుతుంటాడు. ఒకరు రాముడని, మరొకరు కృష్ణుడని, ఇంకొకరు అల్లాఅని, వేరొకరు జీసస్‌అని ఆరాధనలు సలుపుతున్నారు. అన్నింటికి మూలాధారమైన Fundamental Power ఒక్కటే. అదియే శివశక్తిస్వరూపం. ఈ శివశక్తితత్త్వము సర్వత్రా వ్యాపించినటువంటిది. 'భవానీ శంకర' అని ఈ ప్రపంచానికి ఒక పెద్దపేరు. 'భవాని' అనగా శ్రద్ధ. 'శంకర' అనగా విశ్వాసము. అనగా శ్రద్ధా విశ్వాసములతో కూడినటువంటిదే ఈ జగత్తు. శ్రద్ధవలననే ఈ శంకరస్వరూపమైన కార్యక్రమములు కొనసాగి పోతున్నాయి. ఈ శంకర స్వరూపమైనటువంటిది భవాని

## భగవాన్ సాయి దివ్యబోధ

స్వరూపమే. ఈ భవాని అనేటటువంటిది శంకర స్వరూపమే. ఈ రెండింటియొక్క అర్ధనారీశ్వరతత్త్వమే ఈ జగత్తు. అనగా ఈ జగత్తునందే భవాని, శంకరులు సమ్మిళిత స్వరూపాన్ని ధరించి ఉన్నారు. ఏ నామము, ఏరూపమును స్మరించినప్పటికినీ భవాని శంకరుల తత్త్వమునే అనుసరించాలి. శ్రద్ధావిశ్వాసములు లేకుండా దేనినీ మనం సాధించలేము. "శ్రద్ధావాన్ లభతే జ్ఞానం" శ్రద్ధవలననే మనకు జ్ఞానం లభిస్తుంది. విశ్వాసం వలననే మానవత్వంలో ఉన్న దివ్యత్వాన్ని మనం దర్శించగలుగుతున్నాం. కనుక విశ్వమునంతయూ భవానీ శంకర స్వరూపమే, అర్ధనారీశ్వర స్వరూపమే. అందువలననే ఈ జగత్తునందు జన్మించిన ప్రతిమానవుణ్ణి 'శ్రీమతి', 'శ్రీ' అని ఉచ్చరిస్తున్నారు. 'శ్రీమతి' అనగా భవాని. 'శ్రీ' అనగా శంకరుడు. ఈ రెండింటి యొక్క ఏకత్వమే దివ్యత్వమైనటువంటి మానవత్వము.

శారీరకంగా భవాని, మానసికంగా శంకరత్వము. ఈరెండింటియందు మూడవది కూడా ఉన్నది. అదియే దివ్యమైనటువంటి 'ఆత్మతత్త్వము'. కనుక భక్తి జ్ఞాన వైరాగ్యముల యొక్క తత్త్వమును ఈ యొక్క

దివ్యతత్త్వంగా భావించి మనం విశ్వసించాలి. ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి, జ్ఞానశక్తి. ఈ ఇచ్ఛాశక్తియే ప్రాపంచికమైన , భౌతికమైన , లౌకికశక్తి. అదియే ఈ దేహము. క్రియా శక్తియే మనయందున్నటువంటి మానసికశక్తి. జ్ఞానశక్తియే ఆత్మతత్త్వము You are not one Person But Three The one You Think You Are అదియే Physical Body (భౌతికశక్తి) The One Others Think you are అదియే Mental Body (మానసిక శక్తి). The one you Really You are - అదియే ఆత్మశక్తి. కనుక ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి, జ్ఞానశక్తితో కూడినటువంటిదే, ఈ దివ్యమైనటువంటి ప్రపంచం. ఇది సర్వత్రా వ్యాపించినటువంటిది. ఈ శక్తిని దాచటానికి ఎవరి తరమూ కాదు. ఇలాంటి పవిత్రమైన శక్తితత్త్వాన్ని ప్రతిమానవుడు గుర్తించడానికి ప్రయత్నించాలి.

ఎక్కడ చూచినా భగవత్ తత్త్వము ఉంటూనే ఉన్నది. దైవం నీవెంట, జంట, ఇంట ఉన్నాడు. ప్రతివానిలో లీనమై ఉన్నాడు. అంతర్భూతమై ఉన్నాడు. అంతరాత్మగా నిలచి ఉన్నాడు. ఇందులో మూడుతత్త్వములు ఉంటున్నాయి. స్థూలము, చిత్తము, చిత్తైకాగ్రత - ఈ మూడు తత్త్వముల యందున్నటువంటి దివ్యత్వమును మనం గుర్తించడానికి ప్రయత్నించాలి. దీనికోసం మానవుడు అనేక సాధనలు సలుపుతున్నాడు. అయితే ఎన్ని సాధనలు చేసినప్పటికినీ భవానీ శంకరుల అనుగ్రహం లేకుండా ఫలించవు.

దివ్యమైనటువంటి దివ్యతత్త్వము ప్రతిమానవుని యందు అంతర్భూతమై ఉంటున్నది. ఇట్టి అంతర్భూతమైన దివ్యత్వాన్ని గుర్తించడానికి అవసరమైన శక్తి మనయందు కూడా ఉన్నది. సూర్యోదయం కాకుండా నిలిపివేయడానికి సుమతికి ఆ శక్తి ఎక్కడినుండి వచ్చింది? పతిభక్తి చేతనే ఈ శక్తిని తనయందు ఆవిర్భవింపజేసుకుంది. కనుక శ్రద్ధను అభివృద్ధి గావించుకోవాలి. శ్రద్ధ అభివృద్ధి అయినప్పుడు విశ్వాసం గాఢంగా లభిస్తుంది. వేళ్ళు లోపలికి వెళ్ళిన కొద్దీ చెట్టుకూడా పెరుగుతూ వస్తుంది. 'శ్రద్ధ' అనే వేరు లోపలికి వెళ్ళినప్పుడే **'విశ్వాసం'** అనే చెట్టు పెరుగు తుంది. ఈ శ్రద్ధా విశ్వాసములు లేకుండా ఏ నామమును గాని , ఏ రూపమునుగాని స్మరించిన ప్రయోజనం ఉండదు. కాని అనేక సాధనలచేత ఈ దైవత్వాన్ని పొందాలని ప్రయత్నిస్తుంటారు. ఇవన్నీ కేవలం భౌతికమైన, లౌకికమైన తృప్తిని పొందడానికి చేసే సాధనలు మాత్రమే.

నారదుడు నవవిధ భక్తి మార్గములను బోధించాడు. **"శ్రవణం, కీర్తనం, విష్ణుస్మరణం, పాదసేవనం, వందనం, అర్చనం, దాస్యం, స్నేహం, ఆత్మనివేదనం"**- ఇవన్నీ కేవలం ప్రాకృతమైన సాధనలే. సర్వాధారమైన విశ్వమునే విశ్వస్వరూపంగా భావించాలి. **"విశ్వం విష్ణు స్వరూపం".** విష్ణువు, విశ్వమూ రెండూ కూడనూ కార్యకారణ సంబంధమైనటువంటివి. విష్ణుత్వము కారణము. జగత్తు అంతా కార్యము. ఈ కార్యకారణ సంబంధ స్వరూపమే ఈ విశ్వము. కనుకనే ఈ రెండింటినీ **'అగత్యామారకం'** అన్నారు. అనగా అస్థిరముతో కూడినటు వంటిది తత్త్వము స్థిరము. దీనినే వేదము **'అచరం చరమేవచ'** అన్నది. కదలకుండా ఉంటుంది. కాని అన్ని పనులూ చేస్తుంటుంది. దీనికి చక్కని ఉదాహరణ. నీవు రాత్రిభోజనం చేసి పడుకున్నావు. నీ దేహం ప్రక్కమీద ఉన్నది. కాని స్వప్నావస్థలో సర్వకార్యములు చేస్తుంటావు. అనేక ప్రదేశములకు ప్రయాణం చేస్తుంటావు. స్వప్నావస్థ యందు చరాచరమంతా తిరుగుతుంటావు. కాని దేహం మాత్రం కదలకుండా ప్రక్కమీదనే స్థిరంగా ఉంటున్నది. ఈ చరాచరమంతా చుట్టి కష్టములు, నష్టములు, దుఃఖములు, ఆనందములు అనుభవించేటటు వంటివి కేవలం స్వప్నదృశ్యములే. అదేవిధంగా ఈనాడు అనుభవించేటటు వంటి కర్మలన్నీ స్వప్న దృశ్యములే. ఆత్మ ఒక్కటే స్థిరమైనటువంటిది. కనుక ఈ చరాచరముల యొక్క ఏకత్వమే మానవత్వము. ఇట్టి దివ్యమైన

## విదురనీతి

"షడ్దోషాః పురుషేణహ
హాతవ్యా భూతిమిచ్ఛతా
నిద్రా తంద్రా భయం క్రోధః
ఆలస్యం దీర్ఘ సూత్రతా"

ఈ లోకమునందు ఐశ్వర్యమును కోరునటు వంటి మానవుడు ఈ ఆరు దోషములను వదలి పెట్టవలెను. నిద్ర, బద్ధకము, భయము, కోపము, ఆలస్యము, దీర్ఘాలోచన.

మానవత్వాన్ని మనం పొందినాము. **"జంతూనాం నరజన్మ దుర్లభం"**. మానవజన్మ చాలా ఉత్కృష్టమైనది, సౌజన్యమైనది, సౌశీల్యమైనది. అట్టి మానవజన్మ అందరికీ ప్రాప్తించదు. ప్రాప్తించిన ప్రతిమానవుడూ దైవత్వంకోసం పాటుపడడు. కేవలం కొన్ని ఆరాధనలు చేస్తూ, ఆధారంచేత దివ్యత్వాన్ని చేరుకోవడానికి ప్రయత్నిస్తుంటారు. అదియే **'విగ్రహారాధన'**. రాముడని, కృష్ణుడని, జీసస్ అని కొన్ని విగ్రహాలను తయారు చేసుకొని ఆరాధనలు చేస్తున్నాం. ఇవన్నీ తాత్కాలిక దృశ్యములే, అనిత్యమైన దృశ్యములే. నిర్గుణ స్వరూపములే. ఇలాంటి ఆరాధనలు చేసి ప్రయోజనం ఏమిటి? ప్రతి మానవుడూ సమాజంలో ప్రవేశించి , ఈ చిత్తస్వరూపాన్ని ఆరాధన చేయాలి. చిత్తమే జ్ఞేయము, అదియే శివత్వం, అదియే బ్రహ్మతత్త్వము. కనుక ఈ లౌకికమైన , ప్రాకృతమైన, భౌతికమైన భ్రమలను క్రమక్రమేణా వైదొలగించుకుంటూ రావాలి. ఆత్మసంబంధమైన, దైవసంబంధమైన, బ్రహ్మ తత్త్వంతో కూడినటువంటి ప్రధానమైన లక్ష్యమును మనం గురియందుంచుకోవాలి. ఇలాంటి సత్యమును మనం ఈనాడు మరచిపోతున్నాం.

భక్తునికి, భగవంతునిపైన ఎంత ప్రేమ ఉన్నదని నీవు చూచుకుంటున్నావు. కేవలం నీ ప్రేమను మాత్రమే నీవు కొలతవేసుకుంటున్నావు. అది తప్పు. భగవంతుడికి నాపైన ఎంత ప్రేమఉన్నదనే దానిని నీవు కొలత తీసుకోవాలి. ఈ రెండింటి ఏకత్వమందే దివ్యత్వము ఉంటున్నది. అదియే **"నిర్గుణం,నిరంజనం , సనాతనం, నికేతనం, నిత్యశుద్ధ బుద్ధముక్త నిర్మల స్వరూపిణం"**, అదియే బ్రహ్మతత్త్వము. అదియే ఈశ్వరత్వం, అదియే ఆత్మతత్త్వము. కనుక లౌకికమైన భ్రమలను క్రమక్రమేణా మరచి చిత్తభ్రాంతిని మనం అభివృద్ధిపరచుకోవాలి. ఆ చిత్తమునకు మించినది మరొకటిలేదు. 'చిత్తము' అనగా చాలామంది హృదయమనుకుంటున్నారు. అదికాదు. సత్, చిత్, ఆనందం.. 'సత్' - ఇది శాశ్వతము. 'చిత్' పరిపూర్ణము. ఈ రెండింటి యొక్క ఏకత్వమే 'ఆనందము'. 'సత్' సత్యమైనటువంటి త్రికాల భాజ్యం సత్యం. ఎందులో ప్రవేశించినప్పటికినీ- ఇది మాధుర్యమే. అలాంటి మధురమైన చక్కెరను ఒక చేతిలో పట్టుకొని, పరిపూర్ణమైన జ్ఞానమును మరోచేతిలో పట్టుకొని, (ఈ పరిపూర్ణ జ్ఞానము Water (నీరు) వంటిది. ఈ సత్యనిత్యమైనటువంటి చక్కెరయే భగవత్ తత్త్వము.) ఈ చక్కెర, నీరు కలిపివేస్తే అది Water కాదు. 'సిరప్' అయిపోతుంది. కనుక సత్, చిత్, ను రెండూ ఏకం చేస్తే 'ఆనందం ' కలుగుతుంది. దీనికి మించిన ఆనందం మరొకటిలేదు.

మనం ఈనాడు ఆనందమును అనుభవించాలని ఆశిస్తున్నాము. కాని మనం ఈనాడు భావించే ఆనందం తాత్కాలికమైనది, క్షణభంగురమైనటువంటిది. ఇది శాశ్వతమైనటువంటిది కాదు. నిత్యసత్యమైన ఆనందమును అనుభవించడానికి ప్రయత్నించాలి. అదియే నిజమైనటువంటి ఆత్మభావంతో కూడిన ఆత్మ స్వరూపము. దానికి ఆకారములేదుగాని, ఆనందం ఉన్నది. ఆనందమే దాని స్వరూపం. ఆనందమునకు స్వరూపం లేదు. ఆనందం అనుభూతికి మాత్రమే లభ్యమౌతుంది.

*ప్రేమస్వరూపులారా!*

ప్రతి మానవుడు ఇట్టి ఆనందమును ధరించే వ్రా డు.

**"తల్లి గర్భము నుండి జన్మించునప్పుడు**
**కంఠమాలలేవి కానరావు**
**మంచి ముత్యపు సరుల్ మచ్చునకును లేవు**
**మేల్మి బంగరు దండ మెడకు లేదు**
**రత్నాల హారముల్ రంజిల్లగా లేదు**
**పచ్చల పేర్లను పతకలేదు**
**కలదు..కలదు..కలదు.. మీయొక్క కంఠమందు**
**పూర్వజన్మాల కర్మలు పొందుపరిచి**
**మంచియైనను చెడుగైన త్రుంచకుండ**
**బ్రహ్మ మీకిచ్చి పంపెను బరువుమాల !"**

ఆ బరువైన మాలయే ఈ దేహము. ఈ దేహమనేటటువంటిది తల్లి గర్భము నుండి ఆవిర్భవించినటువంటిది. కనుకనే **'మాతృదేవోభవ! పితృదేవోభవ'** అన్నారు. దేహమునకు ప్రధానమైన స్థానము హృదయమే. మీకు తెలుసు విశ్వహిందూ పరిషత్ కార్యదర్శి అశోక్ సింఘాల్ నా వద్దకు వచ్చి "స్వామీ ! మందిరం కట్టాలని మేమెంతో ఆశిస్తున్నాం. రాముడు ఎక్కడ జన్మించాడో, ఆ స్థానమును మీరు నిరూపించండి!" అని అడిగాడు.

"ఇక్కడా! అక్కడా! పుట్టినాడనే విషయం నాకు తెలియదు. కౌసల్య గర్భం అతని స్థానం" అన్నాను ఆమె గర్భమే రామునియొక్క స్థానము. అదేవిధంగా ప్రతి అవతారం, ప్రతివ్యక్తి, ప్రతిశక్తి, తల్లిగర్భమునుండియే ఆవిర్భవిస్తున్నవి.

"తల్లికంటే మిగుల దైవంబె దగ్గర
తండ్రికంటె మిగులు సన్నిహితుండు"

అన్నింటికంటే ఆధారభూతుడైనటువంటివాడు ఒక్క దైవము మాత్రమే. అతనే ఈశ్వరతత్త్వము. ఆ ఈశ్వర తత్త్వమనేటటువంటిది'సో2హం' నుంచి ప్రారంభమవు తున్నది. ఇక్కడ శ్రద్ధ, 'హం' అనేటటువంటిది విశ్వాసం. సో...హం- ఈ రెండూ చేరినప్పుడే 'నేనేదైవం' అవుతుంది. **'సో'** అంటే (అది) 'హం' అంటే నేను. అదే నేను. దీని యొక్క అంతరార్థమే **తత్, త్వం, అసి. కనుక తల్లి గర్భము నుండి పుట్టిన ప్రతి మానవుడు తల్లికీర్తిని, తల్లి గౌరవాన్ని, తల్లి ప్రతిష్ఠను కాపాడేటటువంటి వారుగా తయారుకావాలి.**

నవంబర్ 19వ తేదీ మహిళాదినోత్సవం. ప్రతి వ్యక్తి తల్లి ఇష్టమును అనుసరించాలి. తల్లి అభీష్టములను నెరవేర్చాలి. ఒకవేళ తల్లికి అంత జ్ఞానము లేకపోయినట్ల యితే, నీవు జ్ఞానవంతుడవైనప్పుడు తల్లికి నచ్చచెప్పడానికి ప్రయత్నించాలి. అప్పుడు తల్లికి బిడ్డకు మధ్య ఏ విధమైన బేధములు కనిపించవు. అయితే ఈనాడు ఆ పరమ పవిత్రమైన భక్తితత్త్వాన్ని విస్మరిస్తున్నాము. అదేకాకుండా విశ్వాసమును కూడా కోల్పోతున్నాము. లౌకిక విషయములపై ఉన్న విశ్వాసం, ఆధ్యాత్మిక విషయాలమీద అభివృద్ధి కావటంలేదు. భక్తి భావముకంటె వేరు భావములేదు. భక్తి.. భక్తి.. భక్తి.. భ..క్తి... అనే రెండు అక్షరములయందే సర్వస్వమూ ఇమిడి ఉంటున్నది. భక్తిలో 'భ' కారము ప్రధానమైనటువంటిది. అదియే క్రాంతి స్వరూపము. అదియే ప్రకాంతి. ఆ భక్తి నుండియే శక్తి ఆవిర్భవిస్తున్నది. శారీరక, మానసిక, ఆధ్యాత్మిక శక్తుల ఏకత్వమే శక్తి. భక్తి, శక్తి - ఈ రెండింటిద్వారా ప్రాపంచిక సంబంధమైన 'రక్తి'కలుగు తున్నది. ఈ 'రక్తి'లో మునిగిపోవటంచేత "విరక్తి' కలుగుతున్నది. కొంతకాలానికి ఈ ప్రపంచంమీద'విరక్తి' కలుగుతుంది. అప్పుడే 'దైవభక్తి' వస్తుంది. అప్పుడే భగవంతుడు 'భుక్తి'ని అందిస్తాడు. ఈ 'భుక్తి' చేత దేహమును కాపాడుకొని 'దైవభక్తి' ని మనం పొందాలి. తరువాత దీనివలన 'ముక్తి' అనేది లభ్యమౌ తుంది. కనుకనే తల్లి గర్భమునుంచి వచ్చినటువంటి ఈ దేహమును 'ముక్తి' వరకు ప్రయాణం కొనసాగించాలి.

మానవుని ప్రయాణం I to We కి చేరాలి. ఎంతో దూరం ప్రయాణం చేయనవసరం లేదు. కాశీకో, గయకో పోవాలంటే చాలా దూరం ప్రయాణంచేయాలి. 'నేను...నేను' అనే దేహాభిమానమునుంచి, "మనమూ... మనమూ.." అనేటటువంటి ఆత్మాభిమానములో మనం పడాలి. కనుక ఆత్మాభిమానంలో ప్రవేశించడానికి తల్లి అనుగ్రహం కూడా అత్యవసరం.

అన్నింటికి మూలాధారం తల్లిగర్భమే. అభిమన్యుడు సుభద్ర గర్భంలో ఉండినప్పుడు, అర్జునుడు అనేక కథలు చెబుతూ వచ్చాడు. పద్మవ్యూహంలో ప్రవేశించేంత వరకు చెప్పాడు. ఇంతలో శ్రీకృష్ణుడు వచ్చాడు. కృష్ణుడు నటన సూత్రధారిగదా! దైవం ఎప్పుడు అవసరమైతే అప్పుడు అక్కడకు వస్తుంటాడు. "అర్జునా! ఎంత పొరబడుతున్నావు. వినేది సుభద్ర అనుకుంటున్నావా! కాదు..కాదు... ఆమె ఎప్పుడో నిద్రపోయింది. గర్భంలో ఉన్న శిశువు నీకథనంతా వింటున్నాడు. ఈ పసికందుకు ఈ పద్మవ్యూహమును గురించి ఎందుకు చెబుతున్నావు.? రా!" అని అర్జునుని బయటకు తీసుకొని పోతాడు. కనుకనే పద్మవ్యూహంలోనికి మాత్రమే అభిమన్యుడు చేరగలిగాడు. తిరిగి రాలేక పోయాడు. ఎవరికి ఎక్కడ ఏవిధంగా జరగాలో అంతా

తెలుసు కృష్ణునికి. కృష్ణుడు ఎందుకు ఈ విధంగా చేశాడు? అభిమన్యుడు వీర స్వర్గమును చేరే నిమిత్తమై చేశాడు. తల్లి వద్దని చెప్పినా వినకుండా అభిమన్యుడు పద్మవ్యూహమును ఛేదించడానికి పోయాడు. చిట్టచివరికి ఏమి జరిగింది? తిరిగిరాలేక వీరమరణం పొందాడు. కనుక తల్లి వద్దన్నా పోవటంచేత అపజయం సంభవించింది. తల్లి మాటలలో అంత విలువ ఉన్నది. తల్లికి కుమారునిపైన ఎప్పుడూ ద్వేషం ఉండదు. **దుర్మార్గులైన కుమారులైనా ఈ లోకంలో ఉన్నారుగాని, దుర్మార్గురాలైన తల్లి మాత్రం ఈ లోకంలో లేదు..లేదు...** కనుకనే తల్లి హృదయాన్ని జ్ఞప్తిలోనికి తీసుకొని రావాలనే తలంపుతోను, తల్లి ప్రేమ మాధుర్యం ఎంతటిదో తెలుసుకోవాలని, తల్లి మధుర భావాలను పెంచుకోవాలనే తలంపుతో ఈ 19వ తేదీని మాతృదేవి పండుగగా మనం ఎంచుకున్నాం. **కన్నప్రేమకన్నా మించిన ప్రేమ వేరొకటి లేదు.** కనుక తల్లిని ప్రేమించాలి.! తల్లి , తండ్రి, గురువు, దైవము-ఈనాలుగింటిలో 'తల్లి' మొట్టమొదటిది. అయితే ఈనాటి యువకులు తల్లులను ఏమాత్రం లెక్క (Care ) చేయటం లేదు. ఇంకా కొంచెం ఎక్కువ చదివినవారు.'**అబలలకు ఏమి తెలుస్తుంది?**' అంటారు. ఆ పేరు 'అబల' కావచ్చును గాని సర్వబలములు ఆమెయందు ఉన్నాయి. నిజమైన విశ్వాసం, సర్వశక్తుల బలమూ తల్లిగర్భమునుండే ఆవిర్భవిస్తున్నాయి. కనుక తల్లులను చులకనగా చూడకూడదు. తల్లులు కూడ కుమారులను బలవంతంగా పెంచకూడదు, ప్రేమచేత మంచి మార్గంలో ప్రవేశపెట్టేందుకు ప్రయత్నించాలి.

కొందరు తల్లులు తమ కుమారులు గొప్పవారు కావాలని కోరుకుంటారు. మరికొందరు తల్లులు తమ పిల్లలుమంచివారు కావాలని కోరుకుంటారు. గొప్పవారు కావాలనేకోరిక సరియైనదికాదు. మంచిపేరు రావాలని కోరుకోవాలి. మంచిపేరు అనేది గుణముతో వస్తుంది. గొప్పవాడు '**రావణుడు**' . మంచివాడు '**రాముడు**'. తాను చదివిన చదువులు ఆచరిస్తూ వచ్చాడు రాముడు. కాని అన్ని చదువులూ చదివాడు 'రావణుడు'. కాని ఆచరించలేదు. అజ్ఞానం ఆవరించింది. కాబట్టి అతనికి గొప్ప పేరు వచ్చింది గాని, మంచిపేరు అతనికి రాలేదు. రాముడు ఆచరించి, ఆనందించి, పదిమందికి పంచిపెట్టాడు గనుకనే అతనికి మంచిపేరే వచ్చింది.

భగవంతుడు గానప్రియుడు. మాటలనుంచి వచ్చింది గాని, పద్యమునుంచి వచ్చిందిగాని మాధుర్యంగా ఉండదు. గానము నుంచి వచ్చిందే చాలా మాధుర్యంగా ఉంటుంది. అదే విధంగా తల్లి మాటలుకూడా అంత మధురంగా ఉంటాయి. ఇటువంటి తల్లి ప్రేమతత్వాన్ని మరువకూడదు.

*ప్రేమస్వరూపులారా!*

మానవత్వంలో ఉన్న దివ్యత్వాన్ని ఆవిర్భవింప చేసుకోవటానికి ప్రతివ్యక్తీ ప్రయత్నించాలి. మీలో అనంతమైన శక్తి ఇమిడి ఉంటున్నది. దానిని అభివృద్ధి పరుచుకుంటే 'సుమతి' మాదిరి సూర్యోదయాన్ని సహితం అరికట్టవచ్చును. సావిత్రివలె మరణమును సహితం రద్దుపరిచి సత్యవంతుని ఇంటికి తీసుకొనివచ్చినట్లు తీసుకొనిరావచ్చును. కనుక మన యందున్న శక్తిని మొట్టమొదట మనం అర్థం చేసుకోవాలి. అలాంటి అంతర్భూతమై ఉన్న దివ్యశక్తిని అభివృద్ధి వరచుకుంటే, మనకంటే దేవుడు వేరొకడులేడు. సర్వస్వరూపులు నీవే! సర్వానందమూ నీవే! సర్వస్థానములు నీవే! ఇది, అదీ అని చెప్పటానికి వీలులేదు. **"అక్కడ ఇక్కడ, ఎక్కడ చూచిన ఒక్కడే ఆత్మల మక్కువ అయి ఉన్నాడు."** కనుక శ్రద్ధ, విశ్వాసం, ముఖ్యం. ఇవి భద్రంగా ఉండాలి. ఈ రెండూ భద్రంగా ఉంటే సాధించలేనిదంటూ ఏదీ లేదు. క్షణంలో సాధించవచ్చును, మోక్షాన్ని పొందవచ్చును. ఆనందాన్ని అనుభవించవచ్చును. దీనికి ఏమాత్రం శ్రమించనవసరం లేదు. అట్టి శ్రమలేని మార్గాన్ని వదలి, అనేక శ్రమలతో సాధనలు టకిస్తున్నారు. వీటివలన ప్రయోజనం లేదు. ఈ నామములన్నీ కేవలం తృప్తినిమిత్తమై ఏర్పడినట్టివే. ఇవి కేవలం ఒక చిహ్నంకోసం పెట్టిన పేర్లు మాత్రమే. నిజమైన పేరు "**శ్రద్ధా విశ్వాసమే**". శ్రద్ధ లేకపోతే విశ్వాసం లేదు, విశ్వాసం లేకపోతే శ్రద్ధయే లేదు. ఈ రెండింటి ఏకత్వమే దివ్యత్వమైనటువంటి '**ఆత్మతత్త్వము**'. ఆత్మతత్త్వమనేది ఎక్కడనో ప్రత్యేకంగా లేదు. నీ నఖ, శిఖ, పర్యంతం అదియే సంచరిస్తుంటుంది. మన రక్తంలోని అణువణువు, కణం కణం ఆ దివ్యమైన ఆత్మతత్త్వమే.

ఏది జరిగినా ఈ శివతాండవమే ఈ జగత్తు అంతా. ఈ తాండవంలోపల కష్టములు, నష్టములు, దుఃఖములు, విచారములు - అనేక లలితకళలు. ఈ కళలు అప్పుడప్పుడూ వస్తుంటాయి, పోతుంటాయి. అదే విధంగా ఈ కష్టములు, నష్టములు వస్తుంటాయి, పోతుంటాయి. ఇవన్నీ కదిలే మేఘముల వంటివి. Money Comes & Goes, But Morality Comes and Grows. అటువంటి నీతి, నిజాయితీలను మనం పెంచుకోవాలి. ఈ విధంగా తల్లులు తమ పిల్లలను ఆశీర్వదించాలి. తమ తమ పిల్లలు గొప్ప ధనవంతులు కావాలని కోరుకోకూడదు. ఒకవేళ ఆ రాత ఉంటే దైవమే పంపిస్తాడు. కనుక ప్రతివ్యక్తీ దైవమును ప్రేమించాలి. దైవప్రేమకు మించినది మరొకటి లేదు. అదియే మనం ఈనాడు చేయవలసిన సాధన. నిజంగా సాధించాలను కుంటే నిత్యసత్యమైన భగవంతుని ప్రేమను సాధించాలి. నెమలి ఎంతో అందంగా ఉంటుంది.

"పెద్ద గుడ్డొకటి ప్రేమతో చేరిన
పెద్ద వజ్రమొక్కటి పెంటలో చిక్కిన
విలువ మారదు దాని వెలుగుపోదు."

## ప్రణతి

సీ॥ బడికేగు పసివాడు వసివాడి పోకుండ
పూల బుగ్గలనిగ్గు పూసి పూసి
బడికేగగాలేని బాల కార్మికులందు
భీమసేన బలమ్ము పేర్చి పేర్చి
ర్యాంకుకై శ్రమియించు రాక్షస విద్యార్థి
కనుమూత పడకుండ కాచికాచి
అత్తవారింటిలో క్రొత్త కోడలు పిల్ల
అగ్గిపాల్గాకుండ ఆపి ఆపి

గీ॥ ఎన్నియో మార్లు ప్రళయాగ్ని నీధరిత్రి
ధగ్ధముంజేయదలచియు దయదలంచి
మనిషి మసిబొగ్గు మాణిక్యమౌనటంచు
వేచి చూచెడిదేవ! ఇవే ప్రణతులు!

డా॥ గంకపాటి నరసింహారావు

నెమలి గుడ్డును తీసుకువెళ్ళి పొదగడానికి కోళ్ళ బుట్టలో పెట్టినా, అది నెమలిగానే పుడుతుంది. పెద్ద వజ్రము పెంటలో దొరికినప్పటికీ దాని విలువ మారదు, వెలుగుపోదు. అదే విధంగా మంచివారు ఎక్కడికి వెళ్ళినా, వారి మంచిపేరు వారి వెంటనే ఉంటుంది. కనుక మనం ఎవ్వరినీ ద్వేషించకూడదు, కోపించకూడదు. ఎవరైనా కొన్ని చెడ్డ పనులు చేస్తే కోపించవచ్చునుగాని, ద్వేషించకూడదు. స్వామికి కోపం వచ్చిందేమో! నాతో మాట్లాడడం లేదను కుంటారు. నాకు కోపం లేదు, నాలో ద్వేషం అంతకన్నా లేదు. కాని అప్పుడప్పుడు కోపించినట్లుగా నటిస్తాను. ద్వేషం ఎవరిపైనా లేదు. కాని కొంతమంది అర్థం చేసుకోలేక ఆ విధంగా భావిస్తుంటారు.

కొంతమంది 'భక్తి..భక్తి' అని పేరు చెప్పుకొని, లోపల నిండుగా కోరికలు పెట్టుకొని స్వామీ! అదికావాలి! ఇదికావాలి! మేము గ్రామసేవ చేస్తున్నాం అంటూ వస్తే నా మనసు అంత త్వరగా కరుగుతుందా? మొదట ఆ కోరికలన్నీ నిర్మూలనం గావించుకోండి! హృదయాన్ని పవిత్రంగావించుకో! అప్పుడు మీరు కోరకుండానే అన్నీ అందిస్తాను. ఆ సత్యమును వారు గుర్తించుకోవటం లేదు. లోపల Negative Thoughts ను పెట్టుకొని, Positive ను వారు ఆశిస్తున్నారు. ఎట్లా లభ్యమౌతుంది.? ఇది అసాధ్యం. కనుక మొదట మీ హృదయాలను పరిశుభ్ర పరచుకొని, Positive Thoughts ను నింపుకోండి! ప్రేమను నింపుకోండి!

హృదయంలో ద్వేషం పెట్టుకొని, పైకి ప్రేమ పలుకులు పలుకుతే ప్రయోజనం లేదు. హృదయం ప్రేమతో నింపుకోవాలి. తల్లి ప్రేమతత్త్వాన్ని క్షణం... క్షణం.. జ్ఞప్తియందుంచుకొని, ఎలాంటి పరిస్థితులయందైనా, తల్లిని సంతోషపెట్టడానికి ప్రయత్నించాలి. నేను ప్రేమమయుడను, నీవూ ప్రేమమయుడవుకా! అప్పుడు మన ఇద్దరమూ ఒక్కటే. I And You are One... One.. అటువంటి ఏకత్వానికి మనం పోవాలి. 'నీవు వేరు, నేను వేరు అనుకుంటే' ద్వేషం పుడుతుంది. విభాగమైపోతుంది. విభాగమునకు చోటు ఇవ్వరాదు. అవినాభావ సంబంధం ఏర్పడాలి. అన్యోన్యాశ్రయము కావాలి. మనమిద్దరం ఒక్కటైపోవాలి. ఇది ఒక్క ప్రేమ చేతనే సాధ్యమౌతుంది.

విశ్వమాత ఈ జగత్. ఆ మాత పిల్లలే సర్వులూ. అందరూ అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళే. ఏమాత్రం బేధం లేదు. నదిలో జలం ఉన్నది, బావిలో జలం ఉన్నది, సముద్రంలో జలం ఉన్నది. కాని అన్ని జలములయందు ఒకే సూర్యుడు ప్రతిబింబిస్తున్నాడు. జలములు వేరుగా ఉంటున్నాయిగాని, సూర్యుడు ఒక్కడే. **' ఒక సూర్యుడు సమస్త లోకములకు ఒక్కొక్కడై ఉండుటకు వీలుకాదు.'** అదే విధముగా నీ హృదయములోని ప్రేమజలములో దైవత్వమనేది ప్రతిబింబిస్తుంటుంది. ఎవరియందు ప్రతిబింబించినా ఒకే దేవుడు. **"ఏకం సత్ విప్రా బహుధా వదంతి."** అందరియందున్న దైవం ఒక్కడే...ఒక్కడే.... నాకు కృష్ణుడు ఇష్టం...., నాకు రాముడు ఇష్టం.. నాకు సాయిబాబా ఇష్టం.. ఇవన్నీ అల్ప బుద్ధుల సంబంధాలు. దైవం ఒక్కడే. ఆ సత్యమును గుర్తించాలి. ఎవరు ఏ నామములు పెట్టుకున్నా ద్వేషించకూడదు. నీవు హిందువుగా ఉంటే పక్కా హిందువుగా తయారుకా! నీవు క్రిష్టియన్‌గా ఉంటే పక్కా క్రిష్టియన్‌గా తయారుకా! నీవు ముస్లీముగా ఉంటే పక్కా ముస్లీముగా తయారుకా! కాని పేరు చెప్పేది ఒకటి ప్రవర్తన మరొక విధంగా ఉండరాదు. ఇది చాలా తప్పు.

**"కాడు మానవుండు ప్రేమయే లేకున్న**
**కాడు క్రైస్తవుండు కాడు సిక్కు**
**కాడు హైందవుండు కాడు ముస్లీము**
**వాడె రాక్షసుండు వసుధపైన"**

నిజంగా వాడే రాక్షసుడు. ప్రేమలేనివాడు రాక్షసుడే. ప్రేమను నింపుకొనినప్పుడు అందరూ ఒకటై పోతారు. అటువంటి ప్రేమచేతనే భారతదేశం యొక్క సంస్కృతి ఎంతో అభివృద్ధి చెందుతూ వచ్చింది. ఈ సంస్కృతిలో స్త్రీలకు అత్యధిక ప్రాధాన్యత ఇవ్వబడింది. కనుక ఏదేశం స్త్రీలయినా సరే, ఆదేశం యొక్క సంస్కృతిని కాపాడుతూ రావాలి. **"జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి"** అని రాముడు చెప్పాడు. నా తల్లి, నేను జన్మించిన దేశము నాకు ఈ రెండూ ప్రధానమన్నాడు. దేశము తల్లి! సంస్కృతి తండ్రి. కాబట్టి తల్లితండ్రులను మనం ఏమాత్రం మరువకూడదు, తల్లి లేకుండా తండ్రి, తండ్రి లేకుండా తల్లి ఉండడానికి వీలులేదు. ఈ ఇరువురూ లేకుండా బిడ్డ లేదు. కాబట్టి ప్రతి దేశమునకు ఒక సంస్కృతి (Culture) ఉంటుంది. ఆ Culture యే Country యే Mother. కనుకనే మనది Mother Land అంటారు. మన సంస్కృతిలో తల్లికి అంతటి ప్రాధాన్యత ఇవ్వబడింది. అదియే భారతీయ సంస్కృతి విశిష్ఠత. అయితే మనం ఈనాడు ఇటువంటి పవిత్ర సంస్కృతిని మరచిపోతున్నాం. **'లోకాస్సమస్తా సుఖినో భవంతు"** అనేటటువంటి సార్ధకనామాన్ని అందించింది మన భారతీయ సంస్కృతి. భగవంతుడిని ఏ నామంతో అయినా పూజించవచ్చును, ప్రార్థించవచ్చును. కాని దేవుడు మాత్రం భిన్నుడు కాడు. ఒక్కడే.. ఒక్కడే..ఈ సత్యమును మాత్రం విస్మరించకండి!

*(ది 19-11-1999న ప్రశాంతినిలయంలో మహిళా దినోత్సవ సదస్సులో భగవాన్ సాయి చేసిన దివ్య ప్రసంగము నుండి)*

*"ఇంద్రియములు పనిచేస్తున్నాయిగాని తృప్తిని, ఆనందాన్ని అనుభవించేది మాత్రం మనస్సే. ఆకలి జఠరంలో పుడుతుంది. ఆహారం అందిస్తే ఆకలి తీరుతుంది. తట్టలోని పదార్థమును తీసినది హస్తము. నమలునది పండ్లు, మ్రింగునది గొంతు, స్వీకరించునది ఉదరము. కాని తృప్తిని ఆనందాన్ని అనుభవించినది మాత్రం మనస్సు. ఆకలిగా ఉన్నప్పుడు దేనినైనా తినమని ప్రేరేపిస్తుంది మనస్సు. ఇది మనస్సు లక్షణం. కాని మరొకటి ఉన్నది. అదే విచక్షణా జ్ఞానం . ఏది తినాలి? ఏది తినగూడదు? అనే నిత్యానిత్య విషయ పరిశీలన బుద్ధికి మాత్రమే ఉంటుంది. విచారణా శక్తి శూన్యమైపోతే మనస్సు గుడ్డిదైపోతుంది. అయితే శరీరానికి , మనస్సుకు, బుద్ధికి ప్రాణాన్ని అందించి, పోషించి కదిలించేది ఒకటున్నది. అదే 'ఆత్మ'. శరీరంతో తాదాత్మ్యం చెందినవాడు ఇంద్రియ సుఖాన్ని పొందుతున్నాడు. మనసుతో తాదాత్మ్యం చెందినవాడు భౌతికంగా ఖేదాన్ని అనుభవిస్తున్నాడు. బుద్ధితో తాదాత్మ్యం చెందినవాడు ఆనందాన్నే పొందుతున్నాడు. కనుక ఆనందమును కావాలని అభిలషించేవారు ఆత్మ దృష్టితో పని చేయాలి. ఆత్మదృష్టితో పనిచేసినప్పుడే సమత్వంవస్తుంది.*



# క్రాంతి - సంక్రాంతి



సిరిసంపదలకు, అందమైన ప్రకృతి శోభకు మన భారతదేశం పెట్టింది పేరు. పండుగలు, వాటి ప్రాముఖ్యత, పర్వదినములు, వాటి పవిత్రత మనవారికి తెలిసినంతగా మరెవరికీ తెలియదు. మనకు వచ్చే పెద్ద పండుగలలో సంక్రాంతి ఒకటి. ఇది మూడురోజుల ముచ్చటయిన పండుగ. మొదటి రోజు భోగి. రెండవరోజు సంక్రాంతి. ఉత్తరాయణం ప్రవేశించే పుణ్యమయిన, పవిత్రమైన కాలము. మూడవ రోజు కనుము.

మార్గశిర పుష్యమాసములు హేమంత ఋతువు. ఇది చాలా అందమైన, ఆకర్షణీయమైన కాలము. తన యొక్క అందచందాలను అడుగడుగున ప్రదర్శిస్తుంది హేమంత లక్ష్మి. పెరట్లో రంగురంగుల పుష్పాలు, చెట్ల ఆకులపైనా, పూలరేకులపైనా మిలమిలమెరిసే మంచు బిందువులు, తోటల్లో ఫలముల భారంతో వంగిన వృక్షాలు, గృహముల నిండా ధాన్యపురాసులు. అటు ఎండాకాక, ఇటు వానాకాక చక్కని చల్లని పిల్లగాలులు. ఒకటేమిటి? ప్రకృతి అంతా చాలా ఆహ్లాదకరంగా ఉంటుంది. ఇంత అందాన్నీ, ఆనందాన్నీ తోడుతీసుకొని ధాన్యలక్ష్మి, దానితో ధనలక్ష్మిని కూడి ఇంకెంతో అందంగా, హుందాగా వస్తుంది సంక్రాంతి లక్ష్మి. దక్షిణాయనంలో శరదృతువు నుండి మొదలయిన చిరుచలి మార్గశిరంలో పెరిగి పుష్యమాసం సంక్రాంతి భోగినాడు వేసే భోగిమంటతో కొంచెం కొంచెం తగ్గుతూ వస్తుంది. అందుకే 'పుష్యమాసంలో పూసంత వేసంగి' అన్నారు. దక్షిణాయనమనే చీకటిలో నుండి ఉత్తరాయణం అనే వెలుగులోకి నడవమని బోధించేదే ఉత్తరాయణ పుణ్యకాలం. అదే సంక్రాంతి పర్వదినం. భోగిని యోగిగా మారమని హెచ్చరించే శుభదినం. సం = కూడటం. క్రాంతి = గొప్ప మార్పు. గొప్ప మార్పుతో కూడినటువంటిదే సంక్రాంతి. దక్షిణాయనమునకు వీడ్కోలు ఉత్తరాయణమునకు స్వాగతాలు పలికే శుభదినం సంక్రాంతి. దక్షిణాయన మనగా చీకటి దేవతలకు రాత్రి. ఉత్తరాయణం దేవతలకు పగలు. అది ఈశ్వరతత్త్వం. హిమవత్పర్వతం స్వచ్ఛమయిన తెల్లని చల్లని ప్రదేశం. అది ఈశ్వరుని నివాసం. హిమవత్పర్వతం నుండియే సూర్యుడు ఉదయిస్తున్నాడు.

సూర్యుడు ధనూరాశి నుండి మకరరాశిలోకి ప్రవేశించే శుభదినమే మకరసంక్రాంతి. అదే ఉత్తరాయణం ప్రవేశించే పవిత్రమైన కాలం. ఈ రోజు నుండి ఉపనయనములు, దైవకార్యములు, శుభకార్యములు ప్రారంభమవుతాయి. ఈ పండుగకు బొమ్మల కొలువులు పెడతారు. భోగినాడు పిల్లలకు భోగిపండ్లు పోస్తారు. సంక్రాంతినాడు క్రొత్త

కొమరగిరి జయప్రద

ధాన్యముతో పొంగలి వండుతారు. పితృదేవతలకు ఉత్తమలోకాలు కలగాలని వారి తృప్తికోసం తర్పణాలు వదులుతారు. దానధర్మములు చేస్తారు. కనుమ రోజు పశువులను ఎంతో అందముగా అలంకరించి ఆడించి ఆనందిస్తారు. ధనుర్మాసం మొదలు సంక్రాంతి వరకు గల నెల దినములు ఇంటి ముంగిట రకరకాల రంగవల్లులు తీర్చి వాటిపై ఆవుపేడతో చేసిన గొబ్బెమ్మలను పెడతారు. ప్రతిరోజు హరిదాసులు భగవంతుని గుణ గానము చేస్తుంటారు. నిత్యము సుఖసంతోషములతో ఉండటానికి మానవుడు .ఈ విధమైన పుణ్యకార్యముల నెన్నిటినో ఆచరిస్తూ ఉంటాడు. ఏ కార్యమును సాధించాలన్నా ఆరోగ్యము కావాలి. 'ఆరోగ్యమే మహాభాగ్యము'అన్నారు పెద్దలు. మానవుని ఆయుర్దాయములో సగభాగం నిద్రకు, విశ్రాంతికి సరిపోతున్నది. మిగిలిన సగము భౌతికమైన, లౌకికమైన సుఖములకు సరిపోతున్నది. నిద్రా సమయం తగ్గించుకుంటే ఆయుర్దాయం పెరుగుతుందంటారు.

ఆయుర్దాయాన్ని ఎందుకు పెంచుకోమన్నారంటే బ్రతికినన్నినాళ్ళు సాటి వారికి సాయపడటానికి, తాను ఎక్కడనుండి వచ్చాడో తిరిగి అక్కడికి వెళ్ళడానికి తగిన శక్తి సామర్ధ్యములను పెంచుకోవడానికి మాత్రమే కోరు కోవాలి. కానీ ఆనాటి హిరణ్యకశిపుడు, రావణాసురుడు

మొదలు ఈనాటి కలియుగ రావణాసురుల వరకు ఆయుర్దాయం ఎంత పెరిగినా తాము సుఖపడటానికి పరులను బాధించడానికి మాత్రమే కాలమును కాయమును దుర్వినియోగపరుస్తున్నారు. ఆకులు కట్టుకునే ఆదిమ కాలంనుండి, అణ్వాయుధాలను ప్రయోగించే ఆధునిక కాలానికి మానవ మేధాసంపత్తి పెరిగిపోయింది. విజ్ఞాన శాస్త్రం ఎంతో ఎత్తుకు ఎదిగిపోయింది. కానీ ఆ విజ్ఞానం వెర్రితలలు వేసి కేవలం భౌతికమైన, లౌకికమైన, అశాశ్వత మైన విషయాలకే పరిమితమైపోతున్నది. భౌతికముగా ఆరోగ్యము బాగుంటే భౌతికసుఖాలను మాత్రము అనుభవిస్తారు. ఇవి అసత్యమైనవి, అశాశ్వతమైనవి. సత్యమైన, శాశ్వతమైన సుఖము కావాలంటే స్వచ్ఛమైన, నిర్మలమైన మానసిక ఆరోగ్యం ఉండాలి. మన పవిత్రమైన భారతావనిలో పండుగల పరమార్థం ఒక్కటే. ఉత్తమమైన మానవ జన్మను సార్థకం చేసుకోమని, పాపభీతిని, దైవప్రీతిని పెంచుకోమని ప్రబోధిస్తున్నాయి. పారమార్థికచింతన అనే వంతెనపై మానవుని నడిపించడానికి ఏర్పడిన పరమార్థ సాధనాలే మన పండుగలు, పర్వదినములు. పారమార్థిక చింతన మానవుని సాత్వికునిగా మారుస్తుంది. సాత్విక జీవనం శాంతికి మూలం. శాంతియుత సహజీవనమే సమాజ పురోభివృద్ధికి మూల సూత్రం. పురోభివృద్ధి చెందిన సమాజం ప్రపంచానికే ఆదర్శవం ంవుతుంది. నిత్య శాంతికి, నిత్యక్రాంతికి ప్రతిబింబమవుతుంది. అటువంటి శాంతికి, క్రాంతికి మూలమైన పండుగే ఈ మకర సంక్రాంతి పర్వదినం. దానిని అర్థం చేసుకుని నడచుకుంటే పుణ్యమూ, పురుషార్థమూ లభిస్తాయి. #

మహిళావాణి

# అర్థంలేని చదువు వ్యర్థం

"పుస్తకేషు చ యా విద్య
పరహస్తే చ యద్ధనమ్
సమయేతు పరిప్రాప్తే
న సా విద్యా న తద్ధనమ్"

పుస్తకంలోని విద్య, ఇతరుల దగ్గర దాచిపెట్టిన ధనం సమయానికి అక్కరకు రావు. అంటే వీటివల్ల ప్రయోజనం ఉండదు. కనుక విద్య ఎప్పుడూ కంఠస్థమై ఉండాలి. ధనం ఎప్పుడూ తన దగ్గరే ఉండాలి.

**"పుస్తకాలలో మాత్రం మస్తుగా చదువున్నదిగాని, మస్తకంలో మాత్రం మట్టి కనిపిస్తున్నది."** అన్నారు ఒక పర్యాయం భగవాన్ సత్యసాయిబాబావారు. కనుక ప్రతి ఒక్కరూ పెద్దలు చెప్పిన మాటలను శ్రద్ధతో ఆలకించాలి. అనుభవజ్ఞులు వ్రాసిన పుస్తకాలను ఏకాగ్రతతో చదవాలి. చదివిన విషయాలను చక్కగా అర్థం చేసికొని కంఠస్థం చేయాలి. **"అర్థంలేని చదువు వ్యర్థమేగదా!"**

అయితే ఈనాటి విద్యార్థులు పాఠ్యపుస్తకములను సంపూర్ణంగా చదవకుండా, కేవలం గైడ్స్ మీదనే ఆధారపడి పరీక్షలకు వెళ్ళుతున్నారు. గైడ్స్ కూడా పూర్తిగా చదవటం లేదు. ఉపాధ్యాయుడు గుర్తుపెట్టిన కొన్ని ముఖ్యమైన ప్రశ్నలను మాత్రమే చదువుతున్నారు. అదృష్టం కలిసి వస్తే, చదివిన ప్రశ్నలు వస్తున్నాయి. లేకపోతే లేదు. ఇది ఈనాటి పరిస్థితి. ఈ పద్ధతి మారాలి. పుస్తకాలలోని అమూల్యమైన విషయాలను సమగ్రంగా అవగాహన చేసికొని, ఆచరణలో పెట్టినప్పుడే ఆశించిన ప్రయోజనం లభిస్తుంది.

ఇదేవిధంగా తాను సంపాదించిన ధనం తన ఆధీనంలో ఉంచుకోకుండా, ఇతరులకు ఇస్తే, అది సమయానికి చేతికిరాదు. సమయానికి అందని ధనం ఎంత ఉండి ఏమి ప్రయోజనం? దానధర్మాలు చేయాలనే తలంపు కలిగినప్పుడు మనవద్ద లేకపోతే, ఆ తరువాత మన మనసే మారిపోవచ్చు. మనసు మారిన తరువాత దాచి ఉంచిన ధనం చేతికి అందినా ప్రయోజనం శూన్యం. **"ధనమును దాచి...దాచి... చివరకు దొంగలకిత్తురో! దొరలకగనో?"** ఎవరికి తెలుసు? అసలు ఇతరుల వద్ద దాచిన ధనం తిరిగి వస్తుందో! రాదో!

కనుక ధనము, విద్యాధనం మన ఆధీనంలో ఉన్నప్పుడే వాటికి సార్థకత ఏర్పడుతుంది, అవి సద్వినియోగ పడుతాయి. సమయానికి అక్కరకు వస్తాయి.

**- సాయిప్రియ**

# మరుగునపడిన సంపాదక మణిరత్నం 'ఎస్.జి. ఆచార్య'

మరుగునపడిన తెలుగు పత్రికా సంపాదక మణిరత్నాలలో ఎస్.జి. ఆచార్యగా లబ్ద ప్రతిష్టుడైన సింహాద్రి గోవిందాచార్య - సామాన్య పాఠకులకు చేరువగా పత్రికలను తీసుకురావడం, వారికి అందుబాటులో ఉండే విధంగా ధరను నిర్ణయించడం, పత్రికలో మంచి రచనలను ప్రచురించడంతో సరిపెట్టుకోకుండా, చక్కటి శీర్షికలతో, పొందికయిన అచ్చులు, ఆకర్షణీయమైన గెటప్‌తో వాటిని ప్రచురించడం. అన్నిటికన్నా ముఖ్యంగా - తొలిసారి రచనలు చేసే వర్ధమాన రచయితలను ప్రోత్సహించడం మొదలైన ప్రక్రియలను తెలుగు పత్రికలలో ప్రవేశపెట్టిన తొలి తెలుగు సంపాదకుడు ఆచార్య - ఒక్కవాక్యంలో చెప్పాలంటే తెలుగు పత్రికారంగంలో ముద్రణలోనూ, ఆలోచనల్లోనూ ఆధునికతకు శ్రీకారంచుట్టిన సంపాదకుడు ఆచార్య.

పుట్టింది తూర్పుగోదావరిజిల్లా. స్కూలుకు వెళ్ళి చదువుకున్నది ఎక్కువగా లేదు. కాని జీవితమనే విశ్వ విద్యాలయం నుండి చాలా పాఠాలు నేర్చుకున్నారు. ఒకవైపు జాతీయభావాలు, దేశభక్తి, మరొకవంక సాహిత్యాభిరుచి- మరోవంక సమకాలీన సామాజిక సమస్యలపట్ల అవగాహన ముప్పేటగా పెనవేసుకోగా, తన ప్రవృత్తికి అనుగుణమైన జర్నలిజం ద్వారా జీవించాలన్న ఆశయంతో ఆచార్య మద్రాస్ చేరుకున్నారు. ఆనాటి తెలుగు రచయితలకు, పాత్రికేయులకు మకాం మద్రాస్.

**"కానీ" పత్రిక సృష్టించిన సంచలనం**

1920 దశకంలో మద్రాసుకు చేరుకున్న ఆచార్య సమదర్శని, రైతాంగం, ఆనందభారతి, సుధ పత్రికలకు సంపాదకునిగా పనిచేసినప్పటికీ, ఆయనకు గుర్తింపు తీసుకు వచ్చినది 1930 దశకం మొదటి సంవత్సరాలలో స్థాపించిన జన్మభూమి.

దీని వెల ఒక కానీ. బ్రిటిష్‌వారి పాలనా కాలంలో ఉన్న కానీ అంటే రూపాయిలో 64వ వంతు. రూపాయికి 16 అణాలు, అణాకు 12 దమ్మిడీలు. కానీని ఇప్పటి ద్రవ్యమానంలో చెప్పుకోవాలంటే మూడు పైసలు. అంతకు పూర్వం మద్రాస్‌నుంచి వేటూరి ప్రభాకరశాస్త్రిగారి సంపాదకత్వంలో వచ్చిన ఆనందవాహిని మాసపత్రిక సాలుచందా కేవలం రూపాయి. దాదాపు 70సంవత్సరాల క్రితం పత్రికల ధర, చందారేట్లు ఎలా ఉండేవో తెలుసు కుంటే ఆశ్చర్యం కలుగుతుంది.

**కంచి వాసుదేవరావు**

ఆ పత్రిక ప్రచురణ వారానికి మూడుసార్లు. ఆ పత్రిక అప్పటివరకు అమలులో ఉన్న ఐబిజిపి టైపులలో కాక పాయింట్ టైపులలో ముద్రింపబడేది. ఆరోజులలో ఇది కొత్త ప్రయోగమే. మద్రాస్‌లోని ఆంధ్రులని ఈ పత్రిక చాలా ఆకట్టుకొన్నది. పత్రిక వెలువడగానే కాపీలన్నీ హాటు హాటుగా అమ్ముడయిపోయేవి. వార్తల ప్రచురణ, శీర్షికల నిర్ణయంలో ఆచార్య క్రొత్త పద్ధతులను ప్రవేశపెట్టారు. రాజకీయ కార్టూన్లను ప్రచురించేవారు. బ్రిటిష్ పాలనను విమర్శించే రాజకీయ కార్టూన్లను ప్రచురించిన తొలి సంపాదకులు ఆచార్య కావచ్చు. వార్తవాహిని, ఏర్చికూర్చిన పూవులు మొదలైన వినూత్నమైన శీర్షికలు ఉండేవి.

ఆచార్య భయమెరుగని సంపాదకులు. ఆనాటి మితవాద నాయకులు బ్రిటిష్ ప్రభుత్వ విధేయులైన రైట్ ఆనరబుల్ శ్రీనివాసశాస్త్రి, సి.పి. రామస్వామి అయ్యరులను తీవ్రంగా విమర్శించేది. మహాత్ముడు తలపెట్టిన జాతీయ కార్యక్రమాలను బాహాటంగా సమర్ధించేది. అందువలన బ్రిటిష్ ప్రభుత్వ ఆగ్రహానికి గురయింది.

1930 దశకంలో బ్రిటిష్ ప్రభుత్వం జాతీయ భావాలను ప్రచారం చేసే పత్రికలకు కళ్ళెం వేయడానికి ప్రెస్సు ఆర్డినెన్సును జారీచేసింది. దీని ప్రకారం ప్రతి పత్రిక ప్రభుత్వానికి ధరావత్తు కట్టవలసి ఉంటుంది. బ్రిటిష్

ప్రభుత్వ వ్యతిరేకంగా ఎంత చిన్న వార్త రాసినా, వ్యాఖ్యచేసినా ఈ ధరావత్తు సొమ్మును ప్రెస్సుకు ప్రభుత్వం వేసేది. సంపాదకులకు, ప్రచురణకర్తలకు కఠిన జైలుశిక్ష విధించేది. 1930 దశకంలో చాలా తెలుగు పత్రికలు బ్రిటిష్ వారి ఆగ్రహానికిగురై పూర్తిగా ఆగిపోవటమో, కొంతకాలం నిలచిపోవడమో జరిగేది. ధరావత్తుకట్టడానికి నిరాకరించి నందుకు కృష్ణాపత్రిక కూడా కొంతకాలం ఆగిపోయింది. జన్మభూమి పత్రిక కూడా ఈ విధంగానే బ్రిటిష్ ప్రభుత్వ ఆగ్రహానికి గురయింది. కొంతకాలం పత్రిక ఆగిపోయింది. పత్రిక ప్రచురణకర్త అయిన గణేశన్, సంపాదకులైన ఆచార్య జైలుకు వెళ్ళి కఠిన శిక్షలు అనుభవించారు.

జైలునుంచి విడుదల కాగానే ఆచార్య జన్మభూమిని 8-2-1933న పునరుద్ధరిస్తూ తమ పత్రిక ఆశయాలను మరోసారి ఈవిధంగా తెలియజేసుకున్నారు.

'పత్రిక భారత జాతియొక్క అభ్యుదయమునకు పాటుపడ్తుందని వేరే విపులంగా చెప్పవలసిన పనిలేదు. దేశంయొక్క ఆర్థిక పరిస్థితులు చక్కబరిచేటటువంటి. స్వదేశీ ఉద్యమ వ్యాప్తి ఐక్యభారత సాధనము, హరిజనోద్యమము, భారత దేశ పునాది రైతుబిడ్డయొక్క మంచి వీటికి శక్తివంచనలేకుండా పాక్షిక భావము లేకుండా పాటుపడ్తుంది.'

వర్ధమాన రచయితలకు ప[illegible]సాదం చిత్రగుప్త, ప్రజాబంధు

ఐతే ఆచార్యకు జన్మభూ[illegible] కన్న ఎక్కువ గుర్తింపును కలుగచేసిన పత్రికలు 'చిత్రగుప్త' పక్షపత్రిక, 'ప్రజాబంధు' వారపత్రిక.

ప్రజాబంధులోఆచార్య రాజకీయ విషయాలకు ఒకింత ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చారు. కాంగ్రెస్‌లో ఆనాడు అంతర్భాగంగా ఉన్న వామపక్షీయులను ఆయన సమర్థించే వారు. రైతు బాంధవుడు ఆచార్య రంగా కార్యకలాపాలకు ఎక్కువ ప్రచారం చేశారు. సమకాలీన పరిస్థితులను చర్చించే 'కబుర్లపోగు' వంటి శీర్షికలతో పాటు ఒకటి రెండు చిన్న కథలను ఆచార్య ప్రజాబంధులో ప్రచురించే వారు. ఆ పత్రిక పాఠకులను బాగానే ఆకట్టుకుంది. దాదాపు పదిహేను సంవత్సరాలు నడిపిన తర్వాత యాజమాన్యంలో తలఎత్తిన కీచులాటలవలన ఈ పత్రిక అర్ధాంతరంగా ఆగిపోయింది.

ప్రజాబంధుకు భిన్నమైన పత్రిక చిత్రగుప్త. కథారచన చేయాలన్న ఆసక్తితో కలం పట్టిన ఎందరో వర్ధమాన రచయితల తొలి రచనలను ఆచార్య చిత్రగుప్తలో ప్రచురించారు. అట్టివారిలో కొందరు ఆ తర్వాత అగ్రశ్రేణి రచయితలయ్యారు. 'కార్డు కథలు' అనే వినూత్న శీర్షికను ప్రారంభించి మినీ కథల ప్రక్రియకు శ్రీకారం చుట్టారు.

ఆచార్య సామాజికస్పృహతో 'ట్రంక్ టెలిఫోన్' 'గుసగుసలు' అనే వినూత్న శీర్షికలు నిర్వహించారు. ట్రంక్ టెలిఫోన్‌లో ఇద్దరు వ్యక్తులు స్థానిక సమస్యలను- వాటి పరిష్కారాన్ని చర్చించేవారు. గుసగుసలు స్థానిక ప్రభుత్వ కార్యాలయాలలో ఉద్యోగస్థుల అవినీతిని- ప్రభుత్వ కార్యాలయాలలో ప్రజలకు జరుగుతున్న అసౌకర్యాలను ప్రస్తావించేవారు. వ్యక్తుల పేర్లను నేరుగా ప్రస్తావించలేక పోయినా అవి తగలవలసినవారికి తగిలి వారిలో గుబులు కలిగించేవి. చమత్కారం, వ్యంగ్యం, హాస్యాలకు ఆచార్య ప్రాధాన్యం ఇచ్చారు. సంపాదక లేఖలు ద్వారా పాఠకులకు సన్నిహితులయ్యారు. ఆచార్య తన భార్య పేరున చిత్రాంగి అనే మహిళాపత్రికను, కోనంగి అనే పిల్లల పత్రికను నడిపారు.

ఆచార్య గురించి 'జర్నలిజం ఇన్ ఆంధ్రప్రదేశ్' అనే గ్రంధంలో ఇలా రాస్తారు. "Acharya introduced Satire in Journalism, and encouraged readers participation through letters He encouraged prospective journalists including V.R.Narla, Panditaradhyula Nageswara Rao. He edited Janamabhoomi and made Spoken Telugu popular media He was known for display in Journalism during 1930 . It was a change which had set the trend for modern Telugu Journalism "

**మద్రాసుకు వచ్చిన తెలుగు రచయితలకు కొండంత బలం**

మద్రాసు నగరంలో ఉన్న తెలుగు రచయితలకు, పాత్రికేయులకు - మద్రాసులో తమ భవిష్యత్తును వెతుక్కోవడానికి వచ్చే తెలుగు రచయితలకు, వర్ధమాన పాత్రికేయులకు ఆయన కొండంత అండగా ఉండేవారు. ఇందుకు ఒక ఉదాహరణ.

నార్ల వెంకటేశ్వరరావుగారు తన భవిష్యత్తును వెతుక్కుంటూ మద్రాస్‌కు వచ్చారు. ఆయనకు మద్రాస్ కొత్త. తెలిసినవాళ్ళు ఎవరూ లేరు. ఆచార్యగారిని కలుసుకోవాలని నార్లవారి ఆలోచన. సెంట్రలు స్టేషన్‌లో దిగారు. హిగిన్‌బాదమ్స్ బుక్ స్టాల్‌వద్ద ఒక పంచె,లాల్చీ దాల్చిన ఒకాయన అక్కడ పుస్తకాలూ, పత్రికలూ తిరగవేస్తూ కనిపించారు. ఆయనకట్టు తీరుబట్టి తెలుగువాడని గ్రహించిన నార్ల ఆయన దగ్గరకు వెళ్ళి ఎస్.జి. ఆచార్య గురించి వాకబు చేశారు. గమ్మత్తుగా ఆ వ్యక్తే ఆచార్య. నార్ల వారి సంగతివిని ఆచార్య నార్లను తన ఇంటికి తీసుకుని వెళ్లారు. భోజన వసతి సదుపాయాలు కల్పించారు. రెండు నెలలు తన ఇంట్లోనే ఉంచుకుని అన్ని సదుపాయాలు చేశారు. ఇక తనకు పాత్రికేయ ఉద్యోగం దొరకదన్న నిరాశతో నార్లవారు ఉన్నప్పుడు ధైర్యం చెప్పి విశ్వాసం కలిగించింది ఆచార్య. ట్రాం ఖర్చులకు సైతం డబ్బులు లేకపోతే పాకెట్ మనీకూడా ఇచ్చేవారు. నార్లవారి ఆరోగ్యం అంతంత మాత్రం. ఆచార్యగారి దగ్గర ఉండగా ఆయన అస్వస్థతకు గురిఅయితే ఆచార్య వైద్యచికిత్స చేయించడమే కాక స్వయంగా పరిచర్యలు చేసేవారు. చివరకు నార్ల కృషి ఫలించి - జనవాణి, ప్రజామిత్ర పత్రికలలో పనిచేసి ఆ తర్వాత ఆంధ్రప్రభలో చేరి దేశమంతా గర్వించవలసిన అగ్రశ్రేణి పాత్రికేయుడు అయ్యారు. ఇదంతా తొలిరోజులలో ఆచార్య ఇచ్చిన ప్రోత్సాహ ఫలితమే. ఆచార్య లేకపోతే నార్ల నిస్పృహతో మద్రాస్ విడచి వెళ్ళిపోయేవారు. ఒక ఉత్తమ శ్రేణి సంపాదకుడు మనకు దక్కి ఉండేవారు కాదు.

ఆచార్య లక్షలు లక్షలు సంపాదించేవారు. తన కుటుంబ అవసరాలకు సరిపడ్డదానికన్న ఎక్కువే సంపాదించారు. కాని అందులో మిగుల్చుకోవాలని, ఆస్తులు సంపాదించుకోవాలని అనుకోలేదు. ఉన్న డబ్బును బంధుమిత్రులలో అవసరంపడ్డవాళ్ళకు ఖర్చుచేసేవారు. తత్ఫలితంగా ప్రజాబంధు, చిత్రగుప్త ఆగిపోయి ఉద్యోగం కోల్పోయిన సమయంలో ఆయన పేదరిక బాధలను అనుభవించవలసి వచ్చింది. 1950 ప్రాంతంలో ఆంధ్ర ప్రభకు అనుబంధంగా ఆంధ్రప్రభ వారపత్రికను గోయెంకా ప్రారంభించారు. దానికి ఆచార్యను ఇన్‌చార్జి ఎడిటర్‌గా చేయాలన్న ఆలోచన ఆంధ్రప్రభ సంపాదకులైన నార్లకు కలిగినా ఏకారణం వల్లనో అది కార్యరూపం దాల్చలేదు. ఆంధ్రప్రభ సంపాదక వర్గంలో పనిచేస్తున్న విద్వాన్ విశ్వంకు దక్కింది.

చివరకు ఆచార్య పేదరికంతోనే మరణించారు. ఆ విధంగా ఒక అధ్యాయం ముగిసింది.

## సుభాషితవాణి

"శకటం పంచహస్తేషు
దశహస్తేషు వాజినమ్
గజం హస్త సహస్రేషు
దుర్జనం దూరతః త్యజేత్"

బండ్లు పోతున్నప్పుడు ఐదుమూరల దూరం తొలగితే చాలు, ప్రమాదం ఉండదు. గుర్రానికి పది మూరల దూరంలో ఉంటే ఆపద ఉండదు. అలాగే ఏనుగు పోయేటప్పుడు వేయిమూరలు ఎడంగా ఉంటే చాలు, భయం ఉండదు. కాని దుర్మార్గునికి చాలా దూరంలో తొలగి ఉండడం క్షేమం. అంటే దుష్టుడికి ఎంత దూరంగా ఉంటే అంత మంచిది.

# శ్రీనారాయణ గురు

కేరళ రాష్ట్రంలో తిరువనంతపురానికి దగ్గరలో చంప ఝుంటి అనే ఊరుంది. ఆ ఊళ్ళో మదన్ ఆస్సాన్ అనే రైతుండేవాడు. అతడు ఎఝువా కులానికి చెందినవాడు. వృత్తి వ్యవసాయమైనా మళయాళ, సంస్కృత భాషల పరిజ్ఞానం కలిగి, జ్యోతిషము, ఆయుర్వేదాలతో పరిచయం కలవాడై ఉండేవాడు. ఆయన భార్య కుట్టియమ్మ. ఆ దంపతులకు 1855 ఆగస్టు 28న ఒక మగపిల్లవాడు కలిగాడు. అతనికి నారాయణ అని పేరుపెట్టుకొన్నా, అంతా ఎక్కువగా నాను అనే ముద్దుగా పిలుస్తుండేవారు.

నాను చిన్నతనంలో తన ఇంటిని విడిచిపెట్టి, చంప ఝుంటికి సుమారు 60కి.మీ. దూరంలోగల కరునాగపల్లికి వెళ్ళాడు. అక్కడ రామన్‌పిళ్ళాయ్ ఆస్సాన్ అనే పేరుగల ఉపాధ్యాయుని వద్ద ఉండి చదువుకొన్నాడు. సంస్కృత భాషను, వేదాలను, ఉపనిషత్తులను, యోగ శాస్త్రాన్ని నాను అక్కడే అధ్యయనం చేశాడు.

తరువాత నాను అరువీపురానికి వెళ్ళి, అక్కడ కున్హన్ పిళ్ళాయ్ చట్టంపి అను మహనీయునితో మైత్రి ఏర్పరచు కొన్నారు. ఇరువురు కలిసి ఆధ్యాత్మిక విచారం చేస్తూ దేశసంచారం ప్రారంభించారు. తైకేవ్ అయ్యర్ అను గురువు వద్ద యోగాభ్యాసం చేశారు. ఆ తరువాత నాను తమిళ భాష నభ్యసించి అందులో ప్రసంగించే ప్రావీణ్యాన్ని సంపాదించారు.

నాను కొన్నేళ్ళపాటు నాగర్‌కోయిల్ దగ్గరలో గల ఒక కొండగుహలో ఉంటూ తపస్సు చేయసాగారు. ఆ వార్త చుట్టుప్రక్కల వ్యాపించి జనం ఆయన దర్శనార్థం రాసాగారు. స్వామి వారి కరుణవల్ల తమ తమ ఇబ్బందులు తొలగి పోగలవన్న విశ్వాసం ఎందరిలోనో కలిగింది. నారాయణ (నాను)ను క్రమంగా అంతా నారాయణ గురువని పిలవజొచ్చారు. ఆయనను అంతా మానవాతీత దివ్యశక్తులుగల వ్యక్తిగా పరిగణించేవారు. ఆయనను సేవించే వారిలో అన్ని మతాలవారు, అన్ని కులాలవారు ఉండేవారు. స్వామి వారు కూడా ఎట్టి తేడాను ఎంచక అందరితోనూ ప్రేమాదరాలతో మెలగేవారు. ఎవరు ఏమి తెచ్చి నివేదన చేసినా ఆప్యాయతతో స్వీకరించేవారు.

స్వామి వారెక్కడికి వెళ్ళినా కాలినడకనే పోయే వారు. భక్తులు గుర్రాలను, ఎడ్లబళ్ళను ఏర్పాటు చేసినా, అంగీకరించక నడిచి వెళ్ళేవారు. ఆయన సామాన్యంగా ఏ ఒక్కచోట ఉండక సంచారంలో ఉండే వారు. 1915లో వారు శ్రీరమణ మహర్షిని తిరువన్నామలైలో సందర్శించారు. శ్రీనారాయణ గురువుగారు సింహళాన్ని (ప్రస్తుతం శ్రీలంక) రెండుసార్లు సందర్శించారు. శ్రీనారాయణ గురువుగారు గొప్ప సంస్కర్త. కులమత విభేదాలకు ఆయన వ్యతిరేకి. దేవాలయాలలో అందరికీ ప్రవేశం ఉండాలన్నది ఆయన అభిప్రాయం. అందరూ ఎట్టి ఆడంబరం, ఖర్చులేకుండా పూజ చేసికొను వీలుండాలి. అవసరమైనచోట్ల ఆయన నూతన దేవాలయాలను ఇందుకై నిర్మించారు. శూద్రులకు అర్చనలో శిక్షణ ఇచ్చి పూజారులుగా వాటిలో నియమించారు. అందరిని విద్యావంతులుగా చేయాలని, రాత్రి బడులను నెలకొల్పారు. పారిశ్రామిక రంగంలో విద్యార్థులకు శిక్షణ ఏర్పాటు చేశారు.

**భండారు పర్వతాలరావు**

కేరళలో గల ఎన్నో మూఢాచారాలకు ఆయన స్వస్తి పలికించారు. అందులో "తాళికెట్టు" అనేది ఒకటి. ఒకే కుటుంబానికి చెందిన 12 ఏళ్ళు దాటని ఆడపిల్లల నందరినీ ఒక వేదికపై నుంచి అబ్బాయిలందరూ వచ్చి తాళివంటి దానిని ఆ ఆడపిల్లల మెడలో కట్టటమే ఈ తాళికెట్టు. తల్లిపాలు తాగే శిశువులకు కూడా ఇది తప్పదు. అలాగే తిరునుడుకలి అనే మూఢాచారాన్ని ఆయన వ్యతిరేకించారు. తిరునుడుకలి-అనేది సమర్తస్నానం తంతు.

నిరాడంబరంగా వివాహాలను జరిపించే పద్ధతిని కూడా ఆయన ప్రవేశపెట్టారు. చనిపోయినవారి అపరకర్మలకు అనవసరవ్యయం చేయకుండా ఆ సందర్భంగా చనిపోయిన వారిపేర కొంత సొమ్మును ధార్మిక సంస్థలకు విరాళంగా ఇవ్వటం మంచిదని ఆయన బోధించారు. నారాయణగురు బోధలను ఆచరణలోనికి తెచ్చేందుకై నారాయణ గురు సేవాసమితులు దక్షిణాదిలోనే గాక శ్రీలంకలో కూడా ఏర్పడి పనిచేస్తున్నాయి. ●

# భ్రాతృప్రేమ - భ్రాతృభక్తి

శ్రీరాముని భ్రాతృప్రేమ

"శక్యా సీతసమా నారీ మర్త్యలోకే విచినత్వా
న లక్ష్మ సమో భ్రాతా సచివస్సాంపరాయికః"

"సీతవంటి భార్య భూలోకమున ఎచ్చటనైనను వెదికిన లభించవచ్చును. కాని, లక్ష్మణునితో సమానమగు సోదరుడు మాత్రం లభించుట దుర్లభం". అని శ్రీరాముడు విలపిస్తాడు యుద్ధభూమిలో రామలక్ష్మణులిద్దరూ ఒకే పర్యాయం నాగపాశబద్ధులై స్పృహతప్పి పడిపోతారు. అయితే వారిద్దరిలో శ్రీరామునికి ముందుగా తెలివివస్తుంది. లక్ష్మణుని చూచి కన్నీరు కారుస్తూ పైమాటలు అంటాడు శ్రీరాముడు. మరొక పర్యాయం, యుద్ధభూమిలో రావణుడు అతిశక్తివంతమైన 'శక్తి' అనే అస్త్రమును లక్ష్మణునిమీదకు వదలగా, ఆ దెబ్బకు లక్ష్మణుడు మూర్ఛిల్లుతాడు. శ్రీరాముని హృదయం పరితపిస్తుంది. ఎంతగానో విలపిస్తాడు. లక్ష్మణుడు గతించిన తరువాత రావణునితో యుద్ధం చేయటం వ్యర్థమని భావించి ఏడుస్తూ "నేను వనవాసమునకు బయలుదేరునపుడు తల్లి సుమిత్రను, భార్య ఊర్మిళను సహితం వదలి నాతోపాటు బయలుదేరి ఏ విధంగా కానలకొచ్చాడో,. అదే విధంగా ఈనాడు యమపురికేగు అ లక్ష్మణునితో కలసి నేను కూడా యమ లోకానికి పోతాను"అని శ్రీరాముడు అంటాడు. దీనినిబట్టి తన సోదరులపట్ల శ్రీరాముని ప్రేమ ఎంతటిదో, ఎంత పవిత్రమైనదో, నిష్కల్మషమైనదో, ఫలాపేక్షరహిత మైనదో స్పష్టమౌతున్నది.

శ్రీరాముని భ్రాతృప్రేమ వర్ణనాతీతము. సోదరులంటే అతనికి అత్యంత మమకారం, మక్కువ. లక్ష్మణుడు లేకుండగ నిద్రించేవాడు కాదు. అన్నమును కూడా లక్ష్మణుడు లేకుండా భుజించేవాడు కూడా కాదు. ఒకసారి లక్ష్మణునితో "భరతుడుగాని,శత్రుఘ్నుడుగాని, నీవుగాని లేకుండ ఎట్టి అల్ప సుఖమును కోరను. ఈ భూమి నా కొరకు కాదు. మీకొరకు కావలెనని కోరుచున్నాను. మిమ్ములను సంతోషపెట్టాలని, మీకు సుఖములను కలుగచేయాలనేదే నా మనోవాంఛ. ఇంతకు మించి ఏ కోరిక నా మదిలో ఉదయించినా దానిని అగ్నిహోత్రుడు భస్మము చేయుగాక!" అని అంటాడు శ్రీరాముడు. శ్రీరాముని మనోభావాలను ప్రతి కుటుంబం ఆదర్శంగా గైకొంటే, కుటుంబాలలో కలతలు మటుమాయమై పోతాయి. ద్వేషాలకు, వైషమ్యాలకు ఆస్కారమే ఉండదు. సుఖసంతోషాలతో, ఆనందోల్లాసాలతో జీవితాలను గడుపగలుగుతారు.

కొమరగిరి కృష్ణమోహనరావు

లక్ష్మణుని భ్రాతృభక్తి

లక్ష్మణుని భ్రాతృభక్తిని గురించి వర్ణించుటకు మాటలు చాలవు. ఎవ్విధమైన రాజ్యభోగములను ఆశించకుండా, ఉన్న వాటిని కూడా త్యజించి, తన జీవిత సర్వస్వమును శ్రీరామచంద్రునికి అర్పించిన భ్రాతృభక్తి పరాయణుడు లక్ష్మణుడు. శ్రీరాముడు గుఱ్ఱము ఎక్కి వేటకు వెళ్ళేటప్పుడు, ధనుర్ధారియై, అంగరక్షకునిగా శ్రీరాముని అనుసరిస్తూ వెళ్ళేవాడు లక్ష్మణుడు. శ్రీరాముడు అరణ్యావాసమునకు బయలుదేరేటప్పుడు తానూ వస్తానని పట్టుబడుతాడు లక్ష్మణుడు. శ్రీరాముడు వద్దని వారిస్తాడు. కాని లక్ష్మణుడు అంగీకరించడు. "నీవు లేకుండగ త్రిలోకైశ్వర్యములు ఇచ్చిననూ నేను వాటిని కోరను." "భ్రాతా, భర్తాచ, బంధుశ్చ, పితాచ మమ రాఘవః" (సోదరుడు, ప్రభువు, బంధువు, తండ్రియును నాకు శ్రీరామ చంద్రుడే)"అని స్పష్టం చేసి శ్రీరామునితో అడవుల కేగుతాడు. యదార్థంగా తండ్రి ఆజ్ఞానుసారం అరణ్యావాసం చేయవలసింది శ్రీరాముడు. లక్ష్మణుడు అరణ్యాలకు వెళ్ళవలసిన అవసరంలేదు. అయినప్పటికీ సర్వసుఖములను, రాజ్యభోగములను విడనాడి శ్రీరాముని అనుసరించాడు

లక్ష్మణుడు. దీనినిబట్టి లక్ష్మణుని భ్రాతృభక్తి ఎంతటిదో మనం అర్థం చేసుకోవచ్చును.

**భరతుని భ్రాతృభక్తి**

**"న సర్వే భ్రాతర స్తాత భవంతి భరతో సమా:"** 'సోదరులందరూ భరతుని వంటివారు కారు'అని భరతుని భ్రాతృభక్తిని గురించి శ్రీరాముడే కొనియాడుతాడు. భరతుని పవిత్ర చరిత్రమును పరిశీలిస్తే రెండు విశేష గుణములు మనకు గోచరిస్తాయి. 1. ధర్మనిష్ఠ. 2. భ్రాతృభక్తి. దశరధుడే అతని ధర్మనిష్ఠను ప్రశంసిస్తూ **"మన్యే రామాదపి హితం మన్యే ధర్మతో బలవత్తరమ్"**రామునికంటే గూడ ధర్మ విషయమున భరతుడు చాలా నిష్ఠగలవాడు" అంటాడు. కౌసల్య కూడ అతని ధర్మ నిష్ఠను చూచి చకితురాలైంది. వాల్మీకి "ఆకాశ ఇవ నిర్మల:" ఆకాశమువలె నిర్మలమైన మనసు గలవాడు) అని ప్రశంసిస్తాడు. అతని భ్రాతృభక్తి అద్వితీయము. దశరధుని మరణ వార్త విని ఎనిమిదవ రోజున అయోధ్యకు వస్తాడు భరతుడు. తల్లి కైకేయి ద్వారా అన్ని విషయాలు సవిస్తరంగ తెలుసుకొని పట్టరాని కోపంతో, అనరాని మాటలు ఆవేశంతో అంటాడు తల్లితో "ఈ రాజ్యమును ఏలమని నాతో చెప్పటానికి నీకు నోరు ఎలా వచ్చింది; నా తండ్రి ప్రాణాలు తీసి, నా **రాముణ్ణి అడవులకు పంపి నన్ను రాజ్యమేలమంటావా? ఇంతటి మహాపాతకానికి వడిగట్టిన నీవా నాతల్లివి! నీవు రక్కసివి. నీవు ఈ రాజ్యంలో ఉండదగినదానివి కాదు. అగ్నియందు దుమికియో, ఉరిపోసుకొనియో, లేక దండకారణ్యములకు పోయియో మరణించుము"** అని నిష్కర్షగా ఇష్టం వచ్చినట్లు మాట్లాడి, చక్రవర్తికి నిర్వహించవలసిన ఉత్తర క్రియలను సక్రమంగా ఆచరించి, రాజ్యాధికారములను స్వీకరించకుండా, సపరివారంతో, అడవులలోనున్న శ్రీరాముని సన్నిధికి చేరుకుంటాడు. శ్రీరాముని పాదములపైపడి వెక్కి, వెక్కి ఏడుస్తాడు. శ్రీరామునికి బదులుగా తానే అరణ్యవాసం చేస్తానని అర్థిస్తాడు. రాజ్యపాలన చేయమని శ్రీరాముని వేడు కుంటాడు. శ్రీరాముడు అంగీకరించకపోతే ప్రాయోపవేశము నకు పూనుకుంటాడు. శ్రీరాముడు ఓదారుస్తాడు. వశిష్ఠాది మహర్షులు ధర్మసూక్ష్మమును వివరించగా, ఎట్టకేలకు, గత్యంతరంలేక శ్రీరాముని పాదుకలు శిరస్సును ధరించి తిరుగు ప్రయాణమవుతాడు. అయోధ్యలో మాత్రం అడుగు పెట్టక, సమీపమునే ఉన్న నందిగ్రామంలో, సింహాసనమును ఏర్పాటుచేసి, దానిపైన శ్రీరాముడు ప్రసాదించిన పాదుకలను ఉంచి, ప్రజాసమక్షంలో వాటికి పట్టాభిషేకం గావించి "ఈ రాజ్యం శ్రీరాముడిది. దానిని ఆయన **తాత్కాలికంగా నాకు వప్పజెప్పాడు. నేను ఆయన ప్రతినిధిగా, ధర్మయుతంగా రాచకార్యాలను నిర్వహించుతాను"** అని అందరిముందర భరతుడు ప్రతిజ్ఞ చేస్తాడు. సకల భోగభాగ్యములను విడనాడి, నారబట్టలను ధరించి, కందమూలాలను మాత్రమే భుజిస్తూ, కటిక నేలపై శయనిస్తూ, శ్రీరాముని ప్రతినిధిగా పదునాలుగు వత్సరాలపాటు, ప్రజానురంజకంగా పరిపాలన చేసి, తిరిగి ఆరాజ్యమును శ్రీరామునికి వప్పగించాడు. ఇటువంటి మహత్తర అద్భుత సన్నివేశం ప్రపంచ చరిత్రలో మరెక్కడా కన్పించదు. రాజ్యకాంక్షతో, ధర్మాధర్మములను విచారించక, స్వార్థంతో తండ్రులను చంపిన పితృ హంతకులు, సోదరులను తుదిముట్టించిన భ్రాతృ హంతకులు ఎందరో చరిత్ర పుటలను త్రిప్పుతే కనిపిస్తారు. వారందరికీ భరతుడు ఆదర్శప్రాయుడుకాదా? అధికారాన్ని సంపాదించుకోవడానికోసం, వచ్చిన అధికారాన్ని నిలబెట్టు కోవడం కోసం చేయరాని పనులు చేస్తూ, అనేక అక్రమ అకృత్యాలకు వడిగడుతున్న నేటి స్వార్థపరులు, భరతుని త్యాగమయమైన చరిత్రను చూచి సిగ్గుపడాలి.

**శత్రుఘ్నుని భ్రాతృభక్తి**

శ్రీరామ రాజ్యపాలనా సమయంలో, లవణాసురుని బాధలను భరించలేక మహర్షులు శ్రీరాముని వద్దకు వెళ్ళి రక్షించమని మొరపెట్టుకుంటారు. అప్పుడు లవణాసురుని వధించే బాధ్యతను భరతునికి వప్పగించుతాడు శ్రీరాముడు. అప్పుడు శత్రుఘ్నుడు ముందుకు వచ్చి శ్రీరామునితో **"పదునాలుగు సంవత్సరాలపాటు జటాధారియై, దర్భలపై పరుండి, కందమూలాలను మాత్రమే తింటూ కష్టపడిన భరతునికి ఈ బాధ్యత వప్పగించడం భావ్యంకాదు. నేనే లవణాసురుని సంహరిస్తాను. నాకు అనుమతి ఇవ్వండి"** అని ముందుకు వస్తాడు శత్రుఘ్నుడు. గత్యంతరం లేక శ్రీరాముడు ఆ బాధ్యతను శత్రుఘ్నునికి అప్పగించగా, లవణాసురుని

సంహరించి వస్తాడు శత్రుఘ్నుడు. అప్పుడు శ్రీరాముడు మధురానగర రాజ్యమును పాలించమని శత్రుఘ్నుని ఆదేశించగా అతను సిగ్గుతో **'కథం తిష్టత్సు జ్యేష్టేషు కనీయానభిషిచ్యతే'** 'నా కంటే పెద్దలుండగా నాకేల ఈ రాజ్యాభిషేకం' అని అంటాడు శత్రుఘ్నుడు. అంతేకాదు పదునాలుగ సంవత్సరాలు శ్రీరాముని వియోగ దుఃఖమును పొందిన నాకు మరల ఈ వియోగమును కల్పించవద్దని ప్రాధేయపడుతూ **"తల్లిలేని శిశువువలె నిన్ను విడిచి ఒక్క క్షణమైనా వేరొకచోట ఉండజాలను"** అని విలపిస్తాడు శత్రుఘ్నుడు. ఈ సంఘటనను బట్టి శత్రుఘ్నుని భ్రాతృభక్తి ఎంతటిదో బోధపడుతున్నది.

శ్రీరామచంద్రుని సోదరులు ఒకరికి మించిన వారు మరొకరు. భ్రాతృప్రేమ వారి జీవిత పరమాశయం. భ్రాతృభక్తి వారి జీవితలక్ష్యం. శ్రీరామునివంటి అన్నను పొందిన లక్ష్మణ, భరత, శత్రుఘ్నులు ఎంతటి అదృష్ట వంతులో లక్ష్మణ, భరత, శత్రుఘ్నుల వంటి తమ్ములను కలిగిన శ్రీరాముడు కూడా అంతే అదృష్ట వంతుడు. సత్య, ధర్మ, త్యాగాలే వారిని నడిపించాయి. స్వార్థంతో, సంకుచితత్వంతో ఆస్తులకోసం పోరాటం చేస్తూ, పండంటి కాపురంలో చిచ్చును పెట్టుకొని, సర్వనాశనమౌతున్న ఈనాటి సోదరులు, శ్రీరామ సోదరుల ఆదర్శ జీవిత చరిత్రను ఆదర్శంగా గైకొంటే ఈనాటి సోదరుల మధ్య ఏర్పడుతున్న అగాధం కొంత వరకు తగ్గుతుందేమో! ( )

# ఓ నవ్య సహస్రాబ్దమా! స్వాగతం!!

- ఆచార్య శ్రీవత్స, ఉయ్యూరు

భరత సంస్కృతి సంధాన పఱచువేళ !
  సంప్రదాయ సంజనితమ్ము సంభృతమ్ము
నెగడు హైందవ ధర్మమ్ము నెలవు కొనగ
  నవ సహస్రాబ్ద స్వామి! శ్రీ నతులొనర్తు!

శ్రీమంత సహస్రాబ్దమ!
  తామిక చూడంగవలెను ధారుణి యదున్
తామర తంపర లొలసిన
  ఏమరు పాటింక నొదవు ఇడుములు మీరెన్!

చిక్కంటెను గతమంతయు
  పెక్కింటిలొ చూడచూడ బెంబేలాయెన్
ముక్కంటికి మొరపెట్టిన
  ఒక్కింటికి దారిలేదె? ఊరట జెందన్!

ఒకవంక ముసరె భౌమోత్పాతముల్-జనుల్
  ప్రాణాలు గుప్పిట - పరుగుఁజేసె;
ఒకచెంప అంతరిక్షోత్పాతముల్- నెల
  కొనుచు కుంభిని పట్టి-కుదిపి వేసె;
మరొక చెంప రగిలె- మతమౌఢ్య కార్చిచ్చు
  మనగ లేక జనులు -మంట కలిసె ;
వేరొక చెంత ప్రవేశించె కామాంధు
  ల ప్రహసనాలతో- లసితమయ్యె ;

"బ్లో అవుట్ల" తోడ ధరణి- బూడిదాయె
అట్టి ఘోరకృత్యమ్ముల నణగ త్రొక్కి
మానవ మనుగడకు పరమార్థ మొసగి
శాంతి సౌఖ్యాలు వర్షించు- సంతసాన!

  కనరానివి కనుగొంటిని
  వినరానివి వినగవలసె-బీభత్సములన్
  మనమెఱియగ నెట్లుండును
  చనియెదనని ధర్మడింక చనియెను తండ్రీ!

నూతన వత్సర మాదిగ
ప్రీతిగ జనులెల్లరుండ ప్రేరణలిమ్మా!
యాతన లెల్లయునుడపుచు
నీతని ప్రజలెల్లరుండ నేస్తములిమ్మా!

  గోతులు తీసెడి వారికి
  నీతిగ కనువిప్పునియ్యి నేస్తంబొప్పన్
  ప్రీతిగ రాబడు లన్నియు
  జాతికి యిప్పించవయ్యా! జయమొదలింపన్

విమల"శ్రీవాణి" కృపతోడ వెలుగువేళ!
స్వాగతమ్ము! సహస్రాబ్ద స్వామి! యింత
మనసె నీకర్పణము సేతు; మహిమజూపి
శ్రీకరమ్ములు వర్షించు చిన్మయేశ!

  తివురు నవ్యసహస్రాబ్ద తేజమింక
  విమల [illegible]క్రాంతుల జిలుగు వెలుగులందు
  నవ్యజాగృతుల హరువులై నాంది పల్కి
  రమ్ము! 'స్వర్ణాంధ్ర' గమలచి రాజ్యమేలు!

# అంతరంగ తరంగాలు (స్వామితో ఇంటర్వ్యూలు - ఇన్నర్‌వ్యూలు)

## ఘండికోట వెంకట సుబ్బారావు

### 1) పంచ అంశాలు

భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు భక్తులకు ప్రసాదించే ఆంతరంగిక సమావేశాలు, వారికి మహత్తరమైన ఒక అవకాశము. బాబావారు ప్రతిరోజు ఉదయం, సాయంకాల వేళల వేలాది దేశవిదేశీయ భక్తులకు దర్శన మిస్తూ, వారిమధ్యనుండి నడుస్తూ, భక్తులిచ్చే ఉత్తరాలు స్వీకరిస్తూ, వారితో పలుకరిస్తూ విభూత్యాది వస్తువులు సృష్టించి ఇస్తూ ఉంటారు. ఆ తరువాత వారిలో 20-30 మందిని తమ మందిరపు గదిలోకి పిలిచి మాట్లాడుతారు. ఆ ఇంటర్వ్యూ లలో పాల్గొనే వ్యక్తులకు ఐదురకాల అపూర్వమైన అనుభూతులు కలుగుతుంటాయి.

(1) ప్రప్రథమంగా స్వామి మృదువుగా, ప్రేమగా, అనుగ్రహ పూర్వకంగా చేసే పలకరింపులు.

(2) భక్తులకు ప్రసాదించే ఆధ్యాత్మిక ప్రాముఖ్యతగల అనేక రకాల వస్తువులు మరియు వివిధ రకాల వ్యాధులను అత్యద్భుతరీతిలో స్వామి నయంచేయడం.

(3) అందరికీ సులభముగా అర్థమయ్యే రీతిలో స్వామి అనేక తాత్త్విక, నైతిక, ఆధ్యాత్మిక అంశములను బోధించటం,

(4) దేశము, ప్రపంచము ఈనాడు ఎదుర్కొంటున్న అనేక సమస్యలను గురించి భక్తులు అడిగే విషయాలపై స్వామి అప్పటికప్పుడు చేసే వ్యాఖ్యలు, పరిశీలనలు,

(5) ఇంటర్వ్యూకు పిలువబడిన వ్యక్తులయొక్క వ్యక్తిగత, కుటుంబ, వృత్తిపరమైన జీవితమునకు సంబంధించిన విషయాలలో అత్యంత ఆప్యాయంగా సలహాలు, సూచనలుఇచ్చి, వారి ఆధ్యాత్మికాభివృద్ధికి తోడ్పడడం. అటువంటి ఆంతరంగిక సమావేశాల్లో పాల్గొని ఆ గదినుంచి బయటకు వస్తున్న వ్యక్తుల ముఖాలలో కనిపించే తేజస్సు, ఆనందం అనిర్వచనీయం. వారంతా ధన్యులే కదా!

### 2) త్రిగుణములు, అరిషడ్వర్గములు

స్వామి తన దివ్య హస్తమునుండి అద్భుతమైన రీతిలో కొన్ని వస్తువులను సృష్టించడంతో ప్రారంభమై, తరువాత కూలంకషంగా అమూల్యమైన అనేక ఆధ్యాత్మిక విషయాలు బోధించడం చేత ఇప్పుడు వర్ణించబోయే ఈ ఇంటర్వ్యూను మరువురాని ఒక అపూర్వమైన దివ్యానుభూతిగా పేర్కొనవచ్చును.

ఇంటర్వ్యూ ప్రారంభములో స్వామి విభూతిని సృష్టించి ఆ గదిలోఉన్న అందరికీ పంచారు. తరువాత త్రివర్ణములలో ఆరు విలువైన రాళ్ళు పొదిగిన పతకము గల ఒక మూడు పేటల బంగారు గొలుసును సృష్టించి, చాలా కాలంగా తనకు భక్తురాలైన ఒక స్త్రీని ప్రేమతో ఆశీర్వదిస్తూ ఆమెకు ప్రసాదించారు. ఆ తరువాత ఆ మూడు పేటల హారము, దాని చివరనున్న పతకముల యొక్క ప్రాముఖ్యతను వివరిస్తూ, ఆ మూడు పేటలు సత్త్వరజస్తమోగుణములను సూచిస్తాయని బాబా వివరించారు. ఇక ఆమూడు పేటలగొలుసు మధ్యలోని పతకములో పొదగబడిన ఆరు రాళ్ళు, ఆధ్యాత్మిక రంగములో పురోభివృద్ధికి ఆటంకములుగా నిలిచే, మానవుని అంతరంగములో గల కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములనే అరిషడ్వర్గములను ప్రతి బింబిస్తాయని కూడా చెప్పారు.

తరువాత, సమాజములోగల వర్ణ వ్యవస్థను గురించి ప్రస్తావిస్తూ, ఈ వ్యవస్థ ప్రకృతిలోగల త్రివిధ శక్తుల పరిధికి లోబడి వివిధ కర్మలు నిర్వర్తింపబడడానికి దోహదం చేస్తుందని స్వామి చెప్పారు. ఈ కర్మాచరణ వలన ధర్మోద్ధరణ జరగడమే ఇందలి ధర్మ సూక్ష్మము. విశ్వవ్యాప్తమైన ఆత్మ చైతన్యమును అనుభవించడమనే లక్ష్యము కొరకే స్వధర్మ కర్మ నిర్వహింపబడాలి. అటు

వంటప్పుడే సమాజము సరియైన మార్గములో నడుస్తుంది. శరీరమనే ఉపాధిని ధర్మాచరణకు వినియోగించినప్పుడు హృదయము పవిత్రమవుతుంది. అరిషడ్వర్గములను జయించిన వ్యక్తి యొక్క పవిత్ర హృదయములో ఆత్మసత్యము గోచరిస్తుంది. దీనివలన, దివ్యచైతన్యములో నిరంతరం జీవిస్తూ భగవంతుని సాలోక్య, సామీప్య, సారూప్య,సాయుజ్యములను పొందడానికి వీలుకలుగుతుంది అద్వైతతత్త్వమే సర్వమతముల సారము, సర్వమతముల లక్ష్యము, అని స్వామి ఉద్ఘాటించారు

ఇంకా ఈ సందర్భముగా మాట్లాడుతూ, తెలుగు మాత్రమే తన భాషకాదనీ, పశుపక్ష్యాదుల భాషలతో సహా తనకు అనేక భాషలు తెలుసునని చెప్పారు. ఇంకా, తాను దేవతలతో సంభాషించగలనని చెప్పారు. తరువాత ఆయన, కైలాసములో అప్పుడే శివపూజ జరుపబడిన చందనముతోఉన్న, ఒకవైపున పరమశివుని రూపము, ఇంకొకవైపు పవిత్రమైన "ఓం నమః శ్శివాయః" మంత్రము చెక్కబడిన పతకమును దేవదూతలు కైలాసమునుండి తెచ్చారనిచెబుతూ,నాడు దానిని సృష్టించి అందరికీ చూపించారు.

ఇక ఆంతరంగిక సంభాషణ జరిపే లోపలి గదిలో కుమారుని విద్యాభివృద్ధితో సహా మా కుటుంబమునకు సంబంధించిన కీలకమైన విషయాలపై మాకు కొన్ని సూచనలు ఇచ్చారు. మా ఆఖరి కుమారులిద్దరి పెళ్ళిళ్ళు ఘనంగా తానే జరిపిస్తానని చెప్పారు. ఆయన చెప్పినట్లుగానే ఆరు సంవత్సరాల తరువాత బెంగుళూరులోని త్రయీ బృందావనంలో వారి పెళ్ళిళ్ళు కనీ, వినీ, ఎరుగని రీతిలో స్వామి వారు జరిపించారు. ఆయనే స్వయంగా ఆధ్వర్యము వహించి వేలాదిమందికి షడ్రసోపేతముగా విందు జరిపించారు. ✪

# ధన్యజీవి

## గుండా సత్యనారాయణ, బుక్కపట్నం

భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారి దివ్య పాద పద్మములకు నమస్కరించి ఒక చిన్న విన్నపము చేసు కుంటున్నాను. స్వామి చదువుకునేటప్పుడు కూడా మాకు మొదట పెట్టి తాను తినేవారు. బుక్క పట్టణంలో చౌడమ్మ గుడి వుండేది. స్వామి ప్రతిరోజు కారియర్, పుస్తకాలసంచి తీసుకొని స్కూలుకు వచ్చేవారు. మధ్యాహ్నంపూట చౌడమ్మ గుడి దగ్గరకువెళ్ళితే, మాపిల్లలందరికి కొంచెం కొంచెం ప్రసాదం పెట్టి మిగిలినది తరువాత స్వామి ఆరగించేవారు. ఆనాడు విద్యార్థిదశలో మాయెడల ఎంత ప్రేమచూపేవారో, ఈనాటికీ మావెంట, జంట వుండి, మా ఆపదలను ఆదుకుంటూ మమ్ములను రక్షిస్తూ, కాపాడుతున్న మహానుభావుడు స్వామి. వారిని గురించి ఎంత చెప్పినా తనివి తీరదు. నా సంసారంలో వచ్చిన అనేక ఈతి బాధలను ఆదుకుంటూ, వివాహ సందర్భాలలో సహాయం చేస్తూ నన్ను ఇంతటివాడను చేశారు స్వామి. స్వామి ఒక పర్యాయం చెప్పారు. సంపూర్ణమైన విశ్వాసంతో కొలిచినట్లయితే, మీ వెంట, జంట వుంటానని చెప్పారు. మీరు ఒక అడుగు ముందుకు వేస్తే, పది అడుగులు ముందుకు వేస్తానంటారు స్వామి. ఎప్పుడూ మీవాడనే అంటారు స్వామి. అంతటి ప్రేమమూర్తి, కరుణామూర్తి మన మధ్య ఈనాడు వున్నారంటే మన అదృష్టమేనని చెప్పాలి. స్వామి ఈనాడు మనలో మానవత్వమును పెంపొందింపజేయటానికి, సత్య, ధర్మ, శాంతి ప్రేమలు నెలకొల్పటానికి, వారు కంకణం కట్టుకొని ప్రయత్నం చేస్తున్నారు. ఈ తరంవారమైన మనమంతా స్వామిని చూస్తున్నామంటే, దర్శిస్తున్నామంటే, వారి పాదపద్మముల చెంతవున్నామంటే, మనం నిజంగా ధన్యజీవులం మనం ఈనాడు స్వామి ఔన్నత్యాన్ని చూస్తున్నామంటే, నాకే ఆశ్చర్యంగా వున్నది. స్వామి మాతో విద్యాభ్యాసం చేశారు. స్వామి ఏ జపం, తపం చేశారు? ఏం సాధనలు చేశారు? స్వామి మానవాకారంలో ఉద్భవించిన భగవత్ స్వరూపమే అనటంలో ఏమాత్రం సందేహంలేదు. ప్రపంచంలో సత్య, ధర్మ, ప్రేమలు స్థాపించడానికి, సనాతన ధర్మమును రక్షించడానికి మానవాకారంలో ఉద్భవించి, ఈనాడు సమాజమును కాపాడుతున్న మహానుభావుడు స్వామి. ఆనాడు ద్వాపరయుగంలో కృష్ణావతారంలో గోపికలు ఏవిధంగా ఆడుతూపాడుతూ ఆనందమును అనుభవించారో, ఈనాడు స్వామిని మనం ప్రత్యక్షంగా దర్శిస్తున్నాం, మన కోరికలు నివేదించుకుంటున్నాం, మన కోరికలు తీరుస్తున్నారు స్వామి. వారితో ఆడుతూ, పాడుతూ ఆనందాన్ని అనుభవిస్తున్నాం. ఈనాడు దివ్యత్వాన్ని మనకు ప్రసాదించి, అందించి మనలను పునీతులు చేస్తున్నారు స్వామి. ఇది నిజంగా మన పూర్వజన్మ సుకృతం. స్వామివారి లీలలు చెప్పాలంటే ఎన్నో ఉన్నాయి. వారు అడుగడుగునా వారి ప్రేమతత్త్వాన్ని నిస్వార్థంగా మనకు అందిస్తూనే ఉన్నారు. కనుక మనం ఈనాడు శరణుజొచ్చి, వారి పాదపద్మములకు అంకితమైనామంటే మన జన్మలు తరిస్తాయని నా అనుభవంతో ఈ వాస్తవమును మీ అందరికీ మనవి చేసుకుంటూ స్వామిని ప్రార్థిస్తున్నాను.

ముఖ్యగమనిక : శ్రీ గుండా సత్యనారాయణగారు స్వామివారి చిన్ననాటి స్నేహితులు. ఇప్పుడు వారు పుట్టపర్తిలోనే స్థిరపడి, స్వామిచెంతవుంటూ, స్వామి అనుగ్రహానికి పాత్రులైన ధన్యజీవి. ది.18-10-99న సాయి కుల్వంత్‌హాల్‌లో, స్వామి సన్నిధిలో వారు ప్రసంగించారు. ఆ ప్రసంగమును శ్రీవాణి పాఠకులకు అందించే మహద్భాగ్యం కలిగినందులకు స్వామికి కృతజ్ఞతాభివందనలు.

# ప్రేమను పెంచుకోండి! అసూయా ద్వేషములను విడనాడండి!

"మానం హిత్వా ప్రియోభవతి
క్రోధం హిత్వా న శోచతి
కామం ఇష్టార్ధవాన్ భవతి
లోభం హిత్వా సుఖీ భవతి"

ప్రేమస్వరూపులారా!

ఈ విశాల ప్రపంచమునందు మానవునికి పెనుభూత మైనటువంటిది 'అహంకారం'. ఈ అహంకారము ఉండినంతవరకు కట్టుకున్న భార్యగాని,కన్నబిడ్డలుగాని ప్రేమించరు. ఏనాడు మానవుడు అహంకారమును నిర్మూలనం గావించుకొనునో, ఆనాడే అందరూ అతనిని ప్రేమిస్తారు.

మానవునియందు క్రోధం ఉండినంతవరకునూ శోకం తప్పదు. కోరికలు ఉండినంత వరకు మనకు ఏదీ ప్రాప్తించదు. ఏనాడు ఈ కోరికలను అదుపులో పెట్టుకుందుమో, ఆనాడే మన అభీష్టములు నెరవేరుతాయి. లోభం ఉండినంతవరకునూ మనకు సుఖమనేది ఎక్కడా కనిపించదు. ఏనాడు మానవుడి నుండి ఈ లోభము దూరం అవుతుందో, ఆనాడే మానవుడు సర్వసుఖములనూ అనుభవిస్తాడు.

సామాన్య మానవుని నుండి దైవతాస్వరూపము వరకు ఒక నియమం ఉండాలి. నియమము, నిర్ణయమే గనుక లేకపోతే ఎంతటి శక్తిమంతుడైనా ఏ చిన్న కార్యమూ సాధించలేడు. అవతారములన్నీ కొన్ని నియమములను తాము పెట్టుకొని, కర్తవ్యకర్మలను ఆచరిస్తూ వచ్చారు. భగవంతుడు సర్వశక్తిమంతుడు, సర్వవ్యాపకుడు. అట్టి భగవంతునికి కూడా ఒక నియమం ఉండాలి. అట్టి నియమమే లేకుండిన దైవం కూడా ఎట్టి చిన్న కార్యమూ సాధించలేడు.

రామావతారమునందు శ్రీరాముడు కూడా మూడు పద్ధతులను అనుసరించి, నియమానుసారంగా, తన కర్తవ్యములను నిర్వర్తించుతూ వచ్చాడు. ఎలాంటి పరిస్థితులందైనా సరే ఈ మూడు పద్ధతులను తప్పనని ప్రమాణం చేశాడు. 1. ఏకపత్నీ వ్రతం. 2. ఒకేబాణము. 3. ఒకేమాట. ఒకేమాట, ఒకేబాణం, ఒకేపత్ని. ఈ మూడింటి యందు ఎట్టి పరిస్థితులలోను తన వ్రతమును దాటలేదు.

కృష్ణుడు కూడా అంతే. 1.ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే.....యుగే.... 2. యోగక్షేమం వహామ్యహం 3. మోక్షయిష్యామి మాశుచః. అదే విధముగనే మానవాకారము ధరించిన ప్రతివారు కూడనూ, కొన్ని ప్రమాణములను నియమంగా పెట్టుకొని, జగత్తుయొక్క కళ్యాణమును కోరుతూ వస్తారు.

## భగవాన్ సాయి హితబోధ

'ఇచ్చినమాటనుతప్పను' - ఇది మొట్టమొదటి సాయి యొక్క ప్రమాణం. నామాటను తీసుకొనిన వ్యక్తి, నాకు విరుద్ధంగా ఒకవేళ ప్రవర్తించినప్పటికినీ, నేను అతనిని ఏమాత్రం శిక్షించను. నా ఆజ్ఞకు విరుద్ధమైనమార్గమును అనుసరించినప్పటికినీ, అతనిని నేను ఏమాత్రం దూరం చేయను. అతడు భక్తుడుగాని, శక్తుడుగాని, ముక్తుడుగాని, యుక్తుడుగాని, పరాశక్తుడుగాని - ఏమానవుడైనప్పటికినీ, నానుంచి మాటతీసుకొనిన తరువాత, వాడు ఎంతటి దుర్మార్గంలో ప్రవేశించినప్పటికినీ, నేను అతనిని శిక్షించను.' ఏ జనాః పర్యుపాసతే! ఏ జనుడైనాఫరవాలేదు. ఇది నాయొక్క ప్రేమతత్త్వము. ఎవ్వరినీ నేనింతవరకూ ద్వేషించలేదు. ద్వేషం అంటే ఏమిటో నాకు తెలియదు. నామాటను అందుకొని, నా నుండి ఎన్నియో సుఖములను పొంది, ఎన్నియో ఆనందములను అనుభవించి, కట్టకడపటికి నాకే ద్రోహం చేస్తూవచ్చారు కొందరు. దైవద్రోహులుగా మారిపోయినారు. దైవ ద్వేషులుగా మారి పోయినారు. కాని నేను ఎవ్వరికీ ఏ అపకారము చేయలేదు. ఎవరికీ, ఎప్పుడునూ, ఏ కీడూ తలపెట్టలేదు. అలాంటి నాపైన ఎందుకు ఇంత ద్వేషాలు. ఇది కేవలం వారివారి జన్మాంతర సంస్కారముల ఫలమే. వారు చేసినది వారు

అనుభవించక తప్పదు. కాని నేను ఎట్టి పరిస్థితుల యందైనా, వీరు ఈ విధంగా కష్టములు అనుభవించాలని సంకల్పించను. "ఎవరుచేసిన కర్మవారు అనుభవింపక ఏరికైనను తప్పునన్నా! ఏనాడో, ఏతీరో ఎవరు చెప్పగలరు? అనుభవించుట సిద్ధమన్నా!" ప్రేమతత్త్వంలో వుండినటువంటి మాధుర్యం, ఆ ప్రేమతత్త్వంలో వుండినటువంటి శక్తి సామర్థ్యములు, ఆప్రేమకుతప్ప అన్యులకు అర్థంకావు. అందరూ నాప్రియులే, అందరూ నాస్నేహితులే. నేను వాళ్ళ స్నేహితుడనే. వారునన్ను స్నేహితుడు కాదని చెప్పినప్పటికినీ, నేనుమాత్రం వారి స్నేహితుడనే. కనుక ప్రేమను ఏనాడూ, ఎవ్వరునూ ద్వేషించకూడదు. ప్రేమలో ఉన్న మాధుర్యమును ఎవరూ వర్ణించలేరు. ప్రేమనే నిజమైన ప్రాణము. ఈ ప్రేమతత్త్వమనేది నీకు తెలియక పోయినప్పటికినీ, అందించే ప్రేమను అనుభవించడానికి ప్రయత్నించు. కనుక మనం ఎవ్వరినీ ద్వేషించకూడదు. ద్వేషము, అసూయలు రాక్షసగుణాలు క్రోధంకూడా రాక్షసగుణమే. కనుక మనం మానవతా విలువలను పెంచుకోవాలి.

అయితే ఈనాడు ముఖ్యంగా విద్యావంతులలోపల **'ఐకమత్యం'** అనేది క్షీణించిపోతున్నది. **'ప్రేమతత్త్వము'** అనేది ఎక్కడా కనిపించటంలేదు. ద్వేషం, అసూయలు పెచ్చు పెరిగిపోతున్నాయి. చిన్నచిన్న విషయాలకు కూడా పోట్లాడుకుంటున్నారు.

కనుక ఈనాడు ముఖ్యంగా కాలేజీ పిల్లలు మంచి గుణవంతులు కావాలి. ద్వేషం, అసూయ, క్రోధములు లేకుండా వుండాలి. అహంకారమునకు అసలే అవకాశం యివ్వకూడదు? ప్రేమనే పెంచుకోవాలి. ప్రేమ మీజీవితంలో భాగంకావాలి. ప్రేమ కనుక లేకపోతే మీరు శవంతో సమానం. ఎలాంటి పరిస్థితులయందునూ, ప్రేమను దూరం చేసుకోగూడదు. ఈనాడు యిక్కడ కాకపోయినా, మరెక్కడకుపోయినా నన్ను తలచుకోక తప్పదు. ఎక్కడ వుండినా, నేను వచ్చి మిమ్ములను రక్షించక తప్పదు. అప్పుడు మీరు తెలుసుకొని ప్రయోజనం ఏమిటి? ఈనాడే మీరు తెలుసుకుని ప్రవర్తించండి. ఆ ప్రేమను పెంచుకోండి. ఈ జీవితంలో ప్రేమ లేకపోతే ప్రయోజనం ఏమిటి? అనేటటువంటి సత్యాన్ని మీరు ఈనాడు గ్రహించాలి. ఆ ప్రేమ చేత మనం ఎక్కడికి పోయినా, దేనినైనా సాధించవచ్చును. యావత్ ప్రపంచంలో కూడా మనం విజయాన్ని సాధించవచ్చును. **కనుక మీరు ప్రేమను పెంచుకోండి! అసూయాద్వేషములను విడనాడండి!**

*(దీ. 18-10-99న ప్రశాంతి నిలయంలో భగవాన్ సాయి చేసిన దివ్య ప్రసంగంనుండి)*

గమనిక : అదే ప్రసంగంలో స్వామి చెప్పిన తమ చిన్ననాటి అనుభవాలు గురించి వచ్చే ఫిబ్రవరి 2000 సంవత్సర సంచికలో ప్రచురించబడును.

**స్మరణీయులు - 7**

## బ్రిటిష్ ప్రధాని అట్లీ

ఇంగ్లండులో క్లెమెంట్ అట్లీ ప్రధానిగా ఉన్నపుడు మన దేశం స్వతంత్రదేశమైంది. సూర్యుడు అస్తమించని సామ్రాజ్యానికి ప్రధాని అయిన వ్యక్తి ఎన్నికల ప్రచారానికెలా వెళ్ళాడు? భారతదేశంలోని ఎన్నికల తీరును గమనించినవారు ముక్కుమీద వేలేసుకుంటారు.

అక్కడ ప్రధానమంత్రి ఎన్నికల సభలను ఎవరూ ఏర్పాటు చేయరు. ఆ సభలకోసం ప్రభుత్వం పైసా ఖర్చు పెట్టదు. లారీలలో, బస్సులలో ప్రజలను తీసుకురారు.

అట్లీగారి సొంతకారుకు ఒక లౌడ్ స్పీకర్ తగిలించేవారు. వారి భార్య స్వయంగా కారు డ్రైవ్ చేసేవారు. ఆమె ప్రక్కన ముందు సీట్లో అట్లీ కూర్చునే వారు. వారికున్న ఒకే ఒక సెక్యూరిటిగార్డు వెనుక సీట్లో కూర్చునేవాడు.

వీధిముందు కారు దిగిన అట్లీగారు కారు బంపర్‌పైన నిల్చుని మైకు చేతబట్టుకొని తమ ప్రచారం సాగించేవారు. ప్రసంగం ముగించి కారులో మరోచోటికి వెళ్ళేవారు. ఇలా ఒక ప్రధానమంత్రి, లేదా ముఖ్యమంత్రి ఎన్నికల సభలను నిర్వహిస్తూ వెళ్ళడం మన దేశంలో ఎక్కడైనా చూడగలమా?

భారతదేశం బీదదేశమని చెబుతాము. కాని శ్రీమంతుల ఆడంబరాలన్నీ ప్రదర్శిస్తాము. మన దేశంలో అంతా ద్వైతం. ఏదీ అద్వైతం కాదు!

**- జొనమద్ది హనుమచ్ఛాస్త్రి**

# స్వామి అనుగ్రహము - మనకర్తవ్యము

ప్రేమావతారమూర్తి, ఆనందస్వరూపుడు, అఖండ సచ్చిదానందమూర్తియైన, భగవాన్ శ్రీ సత్యసాయినాధునికి సమకాలీనులుగా ఉంటూ, వారితో కలసి జీవిస్తూ, వారి దర్శన స్పర్శన సంభాషణాదులతో ఆనందిస్తూ, సేవిస్తూ, తరిస్తూ జీవించటం మన జన్మజన్మల సుకృత పుణ్యఫలమని ఖచ్చితంగా చెప్పవచ్చును. అనేక భగవదావతారాలు పరిసమాప్తియైన తర్వాత, అనేకమంది భక్తులు ఆ అవతారకాలంలో జన్మించలేదేయని విచారించారు. భక్తరామదాసు 'నేను శ్రీరాముని కాలంలో జన్మించి నట్లయితే, భగవంతునికి స్వయంగా పాదసేవ చేసుకొనే వాణ్ణికదాయని బాధపడ్డాడుట. ఆ మహాభక్తులకు లభించని అదృష్టం, మనలను ఈ జన్మలో స్వామికి సమకాలీనులుగా జన్మించేటట్లు చేసింది.

**నియర్‌నెస్ - డియర్‌నెస్ : (NEARNESS - DEARNESS)**

అయితే ఎన్నో జన్మల పుణ్యఫలంగా, భగవంతునికి సమకాలీనులుగా, సమీపంగా(Near) జన్మించటం ఒక ఎత్తు అయితే, ఆ అవతారాన్ని గుర్తించి, ఆయనను అనుసరించి, ఆ మహాపురుషుని అనుగ్రహాన్ని (Dear) పొందటం మరొక ఎత్తు గడచిన అవతారాల కాలంలో చూసినట్లయితే, భగవంతుని గుర్తించి సేవించిన వారికంటే, అశ్రద్ధ చేసి, దూరంగా పోయినా వారే ఎక్కువగా కనిపిస్తారు. శ్రీరాముని కాలంలో తండ్రియైన దశరధుడు, పినతల్లియైన కైక కూడా భగవత్తత్వాన్ని గుర్తించలేకపోయారు. తల్లియైన యశోద, చెలికాడైన కుచేలుడుకూడా శ్రీకృష్ణుని ఒక కుమారునిగానూ, స్నేహితునిగానూ భావించారే తప్ప, అతనే భగవంతుడనే తత్త్వాన్ని గ్రహించలేక పోయారు. ఇక షిరిడీసాయి కాలంలో గూడా వారికి సన్నిహితులుగా నున్న ఏ కొద్దిమందో తప్ప మిగిలిన వారందరూ అతనిని ఒక ఫకీరుగానే భావించారు. అందుకనే స్వామి చాలసార్లు మనలను హెచ్చరిస్తుంటారు. "Nearness అత్యవసరమే, దానితోపాటుగా Dearness కూడా ఉండాలి" అని. Nearness అంటే బొగ్గును అగ్నికి దగ్గరగా చేర్చటం వంటిది. అప్పుడు బొగ్గు, నిప్పుకు తాకినంతవరకే అగ్నిగా మారుతుంది. పూర్తి అగ్నిగా మారాలంటే, పైన విసనకర్రతో విసరాలి. ఈ విసరటమే Dearness.

**ఆచరణతోనే అనుగ్రహం :**

ఒకసారి స్వామి **'బాబా భక్తుడనని నీవు ప్రకటించు కొనటం కాదు. నీవు నా భక్తుడవని నేను చెప్పాలి'** అని అన్నారు. మరి మనం స్వామిచేత భక్తుడననిపించుకొని, ఆయన అనుగ్రహాన్ని ఎలా పొందగలుగుతాము? ముందుగా మనం, స్వామిని భగవంతుడని, పూర్తిగా విశ్వసించి త్రికరణ శుద్ధిగా ఆయన అనుగ్రహం కోసం ఎదురుచూస్తున్నామా అని యోచించుకోవాలి. మనకు ఏదైనా కష్టం ఎదురైనప్పుడు, డబ్బుకోసమో,అధికారుల ప్రాపకం కోసమో,స్నేహితుల సహాయంకోసమో ఎదురు చూస్తాము తప్ప స్వామిని మనస్ఫూర్తిగా ప్రార్ధన చేసి, ఆయన మన మొర ఆలకిస్తాడని, మనలను గట్టెక్కిస్తారని విశ్వాసం పొందలేకపోతున్నాము. అదలా ఉంచండి!

**దిట్టకవి శ్రీనివాసాచార్యులు**

ఒకసారి స్వామి తన ప్రసంగంలో **"మీరు స్వామి అనుగ్రహం కావాలని ఆశిస్తారు. కానీ స్వామి చెప్పినవి మాత్రం ఆచరించడానికి ఇష్టపడరు. ఆచరణతోనే అనుగ్రహం లభ్యమౌతుంది."** అన్నారు. కానీ చాలామంది స్వామి అంతగా ప్రాముఖ్యత ఇవ్వని పూజలు, వ్రతాలు, ఫోటోల ప్రదర్శనలు వంటి బాహ్యకర్మలు చేయడానికే ఇష్టపడతారు కానీ, స్వామి చెప్పినట్లుగా సత్యాన్ని పలకటం, కర్తవ్యాన్ని ధర్మయుతంగా ఆచరించటం, ద్వేషం లేకుండా అందరినీ ప్రేమించటం, మనోవాక్కాయ కర్మలద్వారా, ఎవ్వరినీ బాధించకుండటం వంటి చర్యలను ఆచరించరు. కానీ స్వామి విభూతి ఇవ్వాలని, ఇంటర్వ్యూ పొందాలని, స్వామి దృష్టిలో తమ భక్తికి నూటికి నూటి మార్కులు పొందాలని ఆశిస్తారు.

ఒక సందర్భంలో స్వామి కస్తూరిగారితో "నువ్వు ప్రొఫెసరుగా విద్యార్థులకు మార్కులు వేసేటప్పుడు

చదువులో వారి సామర్థ్యము, జవాబులో వారి స్థాయి పరిశీలించాకనే కదా ఆ జవాబులకు తగిన మార్కులేస్తావు. నేను కూడా అలాగే మీ సాధన యొక్క నిలకడ,నిజాయితీ కొలిచి, తూకంవేసి, ఆ సాధన మీఆలోచనలను, మాటలను, చేతలను, ఏవిధంగా ప్రభావితం చేస్తున్నదీ బేరీజు వేసికొని, మీ అభివృద్ధికి తగిన విధంగా నా సంకల్పాన్ని నిర్ణయిస్తాను' అన్నారు స్వామి. స్వామి సంకల్పానికి ఎదురులేదనేది వాస్తవమే! కానీ, స్వామి సంకల్పించాలంటే భజనలు, ఉపవాసాల వంటి బాహ్య సాధనలొక్కటే చాలవు. ఈ బాహ్యసాధనల ప్రభావం మన అంతరంగంపై ఎలా ప్రసరిస్తున్నదీ, తద్వారా నిత్యజీవితంలో మన చర్యలు ఎంత మంచిగా మారినవన్న దాన్ని బట్టే స్వామి సంకల్పం ఆధారపడి ఉంటుందన్నమాట!

కొందరు స్వామి కార్యక్రమాల్లోనూ, ఇతర సేవా కార్యక్రమాల్లో చురుకుగా పాల్గొనవచ్చు. కానీ తన ఉద్యోగ ధర్మాన్ని పూర్తిగా అశ్రద్ధచేస్తూ, పని ఎగగొట్ట ప్రయత్నిస్తారు. కొందరు ఒక ప్రక్క దానధర్మాలు చేస్తూనే, మరొక వంక లంచాలు పుచ్చుకుంటూ. అక్రమ ధనార్జన చేస్తుంటారు. మరికొందరు సంఘంలో ఎంతో వినయంగా, మంచిగా మాట్లాడుచూ, ఇంట్లో తల్లి దండ్రులను అవమానిస్తూ, భార్యాబిడ్డలను వేధిస్తూ ఉంటారు. ఇటువంటి వారు స్వామి అనుగ్రహం ఇంకా రాలేదేయని వాపోతుంటారుగానీ, వారిలోనున్న లోటును గమనించరు.

**జీవితమొక సవాల్ - ఎదుర్కో :**

కొంతమంది తామెంతో కాలంగా స్వామి దగ్గరకి వస్తున్నా, స్వామి తమవైపు చూడటం లేదని, తమను పలకరించటం లేదని, విభూతి సృష్టించి ఇవ్వటం లేదని విసుక్కుంటూ ఉంటారు. మరికొంతమంది స్వామిని మరచి పోయి, ఫోటోలు సైతం తీసేసినవారు కూడా ఉంటారు మన ఆధ్యాత్మిక అభివృద్ధికి ఎప్పుడు, ఏమేమి చేయాలో స్వామికొక్కరికే తెలుసునన్న విషయం వారికి తెలుసుండక పోవచ్చు. అటువంటి వారిని గూర్చి స్వామే ఇలా చెబుతారు **'జీవితమొక సవాల్- సమర్థవంతంగా దానినెదుర్కోవాలని'** ఆధ్యాత్మిక జీవితంలో గూడా అనేక అవరోధాలు, పరీక్షలు వస్తుంటాయి. సాధకునికి అవి ఎదుర్కొనగలిగే నేర్పు ఓర్పు, పట్టుదల ఉన్నప్పుడే స్వామికి ప్రీతి పాత్రుడవుతాడు. సందర్భోచితంగా స్వామి చెప్పే ఒక కవితామాధురి -

పట్టినదేదో పట్టనే పట్టితివి.
పట్టునెగ్గెడిదాక విడువకుండు
కోరినదేదో కోరనే కోరితివి
కోర్కె చెల్లెడుదాక అట్టె ఉండు
ఒడలు తెలియక నీవైన అడుగవలయు
పోరుపడలేక తానైన బ్రోవవలయు
అంతియేకాని మధ్యలో వదలి పోవుట
భక్తుని దీక్షకాదు -

భగవంతుని అనుగ్రహాన్ని పొందటానికి కులంతోగాని, ఐశ్వర్యంతోగాని,పాండిత్యంతోగాని పనిలేదు. భగవంతుడు మననుంచి వాంచించేది నిశ్చలమైన భక్తిని మాత్రమే. భక్తి అంటే నిర్మలమైన, నిస్వార్థమైన ప్రేమ. ఏ ప్రతిఫలాపేక్ష లేకుండా, భగవంతునే ప్రేమిస్తూ ఉండే భక్తుడు భగవంతుని ప్రేమకు కూడా పాత్రుడగుతాడు. వధువు మెడలో మంగళసూత్రం కట్టగానే, వరుని ఆస్తిపై వధువుకు హక్కు ఏర్పడుతుంది. భక్తి అనే సూత్రంతో భక్తుడు భగవంతుని అనుగ్రహానికి పాత్రుడవుతాడు. అట్టి భక్తుడు భగవంతుని కోసం వెదుకనక్కరలేదు. భగవంతుడే భక్తుని దగ్గరకు వచ్చి తన అనుగ్రహాన్ని ప్రసరిస్తాడు.

**బంగారుస్వామి :**

మన జీవితమనే సముద్రంపై స్వామి దివ్యానుగ్రహమనే సూర్యకిరణములు పడుటచేత అది ఆవిరిగా మారి ఆనందమనే మేఘములుగా ఏర్పడి ప్రేమ అనే జలముగా భూమిపై పడుతున్నది. అంత క్రితం ఉప్పునీరు కాస్తా తియ్యటినీరుగా మారిపోతున్నది. మన జీవితంకూడా ఉప్పునీరు వంటిదే! స్వామి సాంగత్యంతో, ఆయన అనుగ్రహంతో అది తియ్యటినీరుగా మారింది. దానిని నిలుపుకొనవలసిన అవసరం మనందరిపైన ఉన్నది. స్వామి సందేశాలను గ్రహించి, మన మనస్సులలో, చేతలలో ఆచరణ పూర్వకమైన మార్పురావాలి.

మన స్వామి బంగారు స్వామి! ఆ స్వామి మనలను 'బంగారూ' అని పిలుస్తున్నారు. ఎందుకో తెలుసా! త్రుప్పుపట్టి ఎందుకూ కొరగాని మన హృదయాలను అందరిచేత ఆకర్షింపబడేలా, అందరూ మెచ్చుకొనేలా బంగారు హృదయములుగా మార్పు చేయటం కోసమనే మనం స్వామి సన్నిధిలో గోల్డ్‌గా తయారవ్వాలనే! ఎటువంటి గోల్డ్! రోల్డ్‌గోల్డ్ కాదు. ప్యూర్ అండ్ పర్‌ఫెక్ట్ గోల్డ్! ఈ నూతన సంవత్సరానికి మనమందరం ఆనంద ఉత్సాహాలతో, చిరునవ్వులు చిందిస్తూ, ఆధ్యాత్మికంగా అభివృద్ధి చెందుతూ, స్వామి దివ్యానుగ్రహానికి అర్హులమవ్వాలని ఆకాంక్షిస్తూ...... సాయిరామ్.

# శ్రీ సాయిరామ తారక మంత్రము

ప్రశాంతి నిలయము నందు వెలసిన ప్రార్థనా మందిరమునందు-రెండుపూటలా జరుగుచున్న భజన కార్యక్రమమువొక అపూర్వమైన దివ్యానుభూతిని కల్గించు చుండును. ఆ ఏకాగ్రత, ఆ శ్రద్ధ, రాగతాళముల సమ్మేళనము, హృదయాంతరాళమునుండి పొంగి పొరలు, భక్తిభావము, ప్రపంచనందెక్కడనూ దొరకని భగవదానంద సౌభాగ్యమని చెప్పవచ్చును.

తరచుగా భగవాన్ బాబాగారు కొన్ని దివ్య నామ సంకీర్తనలను రచించి భక్తజనులకు వినిపించి పాడించు చుందురు. సత్యము, జ్ఞానము, అనంతము, బ్రహ్మ మొదలగు సత్య చైతన్య ప్రబోధలను చేర్చి హరేరామ, హరేకృష్ణ మొదలగు భజన కీర్తనలను తయారుచేసి స్వామి వారు స్వయముగాపాడి, భక్తులతో పాడించుట మధురాను భూతినందించే దివ్యమైన సన్నివేశము.

శివ, కేశవ, లక్ష్మి, దుర్గ, విఠల, వెంకటేశ, రామ, కృష్ణ యేసు, బుద్ధ, నానక్, జొరాష్ట్ర అల్లా మొదలగు సరళమగు నామములతో కీర్తనలెన్నో మనము భజనమందిరమునందు వినగల్గుచున్నాము. త్యాగరాజు, మీరా, జయదేవ, భద్రాచల రామదాసు, లీలాశుక, సూరదాసు, తులసీ, బసవణ్ణ, ఇటువంటి భగవదవతారులపైన కూడా పాటలు పాడు చుందురు. తమిళము, తెలుగు, కన్నడము, హిందీ, సంస్కృతము అన్ని భాషలకు అక్కడ స్వాగతము పలుకు చుందురు. ఉచ్ఛైస్వరాలు జోడించి, తాళములువేస్తూ నోటినిండుగా భజనలను పాడవలెనని, స్వామి చెప్పుచుందురు. ఈ విధముగా సమిష్టి భజనలు పాడుట వలన భక్తులకు భయాలు తొలగిపోయి, శ్రోతలందరియందు భక్తి అంకురము తయారుకాగలదు అనియూ బాబాగారు తమ దివ్య సందేశాలతో వివరించుచుందురు.

ఒక చెట్టు మీద గుంపుగా చేరిన పక్షులు యెన్నోశబ్దాలు చేస్తూ, చెట్టుక్రిందనిలిచిన వారిపై యెంతో గలీజు చేస్తుంటాయి. అట్టి సందర్భాలలో చెట్టుక్రింద చేరినవారు చేతులు తట్టుచూ, హే, హే అని అరిస్తే, ఆ పక్షులన్నియు పారిపోవుచుండును. అదేరీతిగా మనుషుల మనస్సులందు గుంపులుగా చేరిన దుష్టవిషయవాసనలనే పక్షులన్నియు సామగానములనే శబ్దముల వలన పారిపోవుచుండును.

బాబాగారు ప్రకటించు కీర్తనలందు, ధర్మ సందేశములు, సోమరి జనులకు హెచ్చరికలు కూడా చేరియుండును. స్వామివారి కంఠధ్వని, వేయివేణువుల మధుర నాదములుగా భక్తులను తన్మయానందసాగరము నందు ముంచివేయుచుండును. కూర్చొని వినువారు, తమ శరీరములను నిటారుగా నిలిపి, ధ్యానముద్రను పొంద గలరు. నిలబడి వినువారు, వున్నతమైన జీవితాశయములచే స్ఫూర్తినొంది, జన్మసార్థక్యమును చేసుకొనే గమ్యస్థానము వైపు నడచి వెళ్ళగలరు.


కన్నడ మూలం : కే.శే. కస్తూరి
అనువాదం : పంచాంగం శీనప్పశాస్త్రి


ప్రశాంతి నిలయము భజన మందిరము నందు వినిపించే భజన కీర్తనలు ఎన్నెన్నో పట్టణాలలో ప్రపంచపు నాల్గుమూలల ప్రతిధ్వనించుచున్నవి. జనుల చిత్తప్రవృత్తు లందు సైతము పరిశుద్ధమైన పరిణామము వచ్చుచున్నది. తమస్సుచే నిండిన జనులు తరించే సులభమైన నామమే సాయిరామ తారకమంత్రమని తెలియుచున్నది. సర్వార్పణ భావముతో సాయిరామ సంకీర్తనలు జరుగుచున్న దూరతీరాలలో భగవాన్ బాబాగారు దివ్యమైన పరిమళాత్మక మైన విభూతి మూర్తియై అక్కడ చిత్రపటాలలో వ్యక్తమగు చున్నారు. సాయి - ఈ రెండక్షరాలలో స కారము అఖండ చైతన్యశక్తి అయి జగన్మాతృ ప్రేమను మన హృదయాలలో నింపుచున్నది. "రమయతీతి రామః ఆత్మానందానుభూతిని ప్రసాదించేదిగా 'రామ-నామము వర్ధిల్లుచున్నది. సంసారమనే సాగరమును దాటించే నావగా - సాయిరామ - నామము విలసిల్లుచూ తారకమంత్రమేనని తెలియుచున్నది. ✻

**ముఖ్యగమనిక :**

**తమరు పంపే చందా పాతది అయితే చందా నెంబరు వ్రాయండి. క్రొత్తది అయితే స్పష్టంగా 'క్రొత్తచందా' అని వ్రాసి సహకరించ ప్రార్థన.**

మంచి అవకాశము

Phone : 87215
S.T.D. : 08555

# శ్రీ సాయిహరి రియల్ ఎస్టేట్స్

## పుట్టపర్తి, అనంతపురం జిల్లా.



మీకు పుట్టపర్తి యందు ప్లాట్లు, ఇండ్ల స్థలములు
కావలసినవారు, అమ్మదలచినవారు
ఈ క్రింది అడ్రస్సుకు సంప్రదించవలెనని కోరడమైనది.

- సూపర్ స్పెషాలిటీ హాస్పిటల్ ఎదురుగా గల ప్లాట్లు
- గోకులం పోస్టాఫీస్ ఎదురుగా గల ప్లాట్లు
- **M.R.O.** ఆఫీసు ఎదురుగా గల ప్లాట్లు
- బీడుపల్లికిపోవు బస్సు రోడ్డుకు గల ప్లాట్లు
- అపార్ట్‌మెంట్స్ కావలసినవారు
- ప్రశాంతి నిలయము దగ్గరలో గల ప్లాట్లు
- పుట్టపర్తి రైల్వేస్టేషన్ ఎదురుగా గల ప్లాట్లు

**ప్రతినెలా 10వ తేదీన వాసవీ నివాస్ నందు డ్రా తీయబడును**

ఇట్లు



శ్రీ సాయిహరి రియల్ ఎస్టేట్స్

**ప్రొ॥ పి. సిద్దయ్యశెట్టి**

ఆర్యవైశ్య సంఘము వైస్ ప్రెసిడెంట్



ఆర్యవైశ్యసత్రం ఫ్రంట్‌రూమ్, పుట్టపర్తి - 515 134.

# హృదయం

నిత్యజీవితంలో మనకు ఎక్కువగా వినపడుతూ ఉండే పదం హృదయం ఎంత ఎక్కువగా వినవస్తుందో అంత తక్కువగా అర్థం అయ్యే పదమూ అదే! అసలు ఆ పదానికి నిర్వచనం చెప్పబోవటమూ కష్టమే ! కంటికి కనుపించని ఒక అవ్యక్త పదార్థం అది!

స్థూల దృష్టికి అందకపోయినా, అడుగడుగునా మనిషిని వెన్నంటి ఉండి స్వభావ నిర్దేశం చేస్తూ ఉండే ఆత్మ చేతన - ఈ 'హృదయం' అనబడే సత్పదార్థం! మనిషి మాత్రమే అనుభవించి అనుభూతించ గలిగిన జీవ స్పందనలన్నిటికీ కేంద్రస్థానం అది. మన ఊహలకు ఊపిరి పోస్తూ- మన నడతకు ఆలంబనగా నిలిచే ఒక అంతరంగ లక్షణమది! మనసు, గుండె - అన్ని పదాలు కూడా హృదయానికి బదులుగా మనం వ్యవహరిస్తూ ఉండే పదాలే!

ఒక నిత్యచైతన్య కళగా మనిషి అంతర్జగత్తును శాసించే హృదయం - అనేక అనుభూతులకూ, రసస్పందనలకూ నిలయం, జీవితంలోని ప్రతి అనుభవానికి చలిస్తుంది హృదయం- క్రుంగుతుంది ఒకప్పుడు- తరంగమై ఎగురు తుంది మరొకప్పుడు!

ప్రేమా, దయా, స్నేహమూ, వాత్సల్యమూ వంటి రసస్పర్శలతో ఆర్ద్రమైపోగలిగిన హృదయం - మరొకప్పుడు కసి, కోపం, స్వార్థం,ద్వేషం, క్రౌర్యం - వంటి ఆవేశ కావేషాలతో అగ్నిగోళం అయిపోవడం ఎంత విచిత్రం! ఒకటి- మానవీయమైన సుహృల్లక్షణం! మరొకటి అమానవీయ వికృత తత్త్వం! అసలు ప్రేమించే మనస్సు కలిగి ఉండడమే సౌహృద లక్షణం! ఏదో ఒక అనుబంధ బంధంతో ప్రేమించడం ఒక జీవధర్మమే కానీ అసలు ఏ బంధమూ లేనివారిని కూడా ప్రేమించగలగడం మాత్రం దైవీ లక్షణం అవుతుంది! మమత కన్నా సమత గొప్పది కావడం అందుకే!

వాల్మీకికి ఏమి పట్టింది - వేటగాడి బాణానికి ఒక పక్షి నేల కూలితే! వేదనాత్మకమైన, అనుకంపాభరితమైన ఆదిశ్లోకం పలకడానికి ఆ మహర్షికి ఏమి పట్టింది! క్రీస్తుకు ఏమి పట్టింది దీనుల కోసం, అజ్ఞానులైన వారి కోసం, రక్త తర్పణంగా ఆత్మ బలిదానం చేయడానికి? ఎంతటి కారుణ్యం కదిలించి ఉంటుంది ఆయన హృదయాన్ని !

సిద్ధార్థుడికి ఏమి పట్టింది- రాజ్యసుఖాలను కూడా కాలదన్ని అడవులకు పోవడానికి! జీవితంలోని దారుణ వేదనలన్నిటికీ పరిష్కారం వెతుక్కుంటూ పోవడానికి! కవులకు ఏమి పట్టింది పుత్తడి బొమ్మలు పూర్ణిమ కథలను, పుష్పవిలాప కావ్యాలను సృష్టించడానికి!

ఇదంతా, హృదయ జీవులైన వారికి మనసుకు మాత్రమే అందే విషయం ! గుండె నిండుగా ప్రేమార్తిని అనుభవించిన వారు మాత్రమే చేయగలిగిన కార్యకలాపం!

సి. వేదవతి

అయితే - మనిషికి మాత్రమేనా ఈ హృదయస్పందన అంతా ! చెట్టుకూ, చిగురుకూ, రాయికీ, రప్పకూ కూడ గుండె అంటూ ఉంటుందా? ఉంటుందట! వాల్మీకి మహర్షి చెబుతారు రామాయణ కావ్యంలో- సీతకు వచ్చిన కష్టాన్ని చూచి కొండలే కరిగిపోయినాయట. ఆమె బాధను చూడలేక అవి కన్నీళ్ళు పెట్టుకొన్నాయి, ధారలుగా స్రవించే ఆ కొండల మాటున నీటి ఊటలే అందుకు సాక్ష్యం! చేతులెత్తి రోదిస్తున్నాయి అనటానికి ఆ ఎత్తైన శిఖరాలే సాక్ష్యం ! శిలలు ద్రవించి ఏడ్చిన విషయం - శిధిల హంపీని చూచి వికలమనస్కుడైన కవికి మాత్రమే అందే మనో దృశ్యం! ధూళిలో అసహాయంగా పడి ఉన్న అనాధశిశువును సంరక్షించే భారాన్ని ఆ పక్షులు పరామార్థంగా మీద వేసుకోకపోతే మనకు శకుంతల కథ మిగిలి ఉండకపోను!

పశుపక్ష్యాదులకైనా హృదయం ఉంటుందన్న అద్భుత భావనకు సాక్ష్యాలు - మన పంచతంత్ర కథలు! ఆధునిక యుగంలో నివసిస్తున్న మనకు - హృదయం గురించి ఆలోచిస్తే అనిపిస్తుంది కదా- బుద్ధి వికసిస్తున్నది. మేధ పెరుగుతున్నది. కాని హృదయం మాత్రం తరుగుతున్నది. ఎంతటి మేధావంతుడైనా, హృదయశూన్యుడైతే - అన్నీ ఉన్నా- మనిషికి ఏమీలేనట్లే- సుఖజీవన సంస్కృతికి మేధకన్నా హృదయం అవసరం ఎక్కువగా ఉంటుంది కనుక ప్రపంచ వేదన కంతటికీ ప్రతిస్పందించే మానవతా ధర్మం హృదయానిది కనుక!

# 2000 'మెగా' మినీ క్యాలెండర్

మోడల్. ఇమ్మానేని భవసూర్యతేజ, ఏలూరు

శ్రీవాణి పాఠకులకు,
ప్రకటన కర్తలకు,
"2000"
నూతన సహస్రాబ్ది శుభాకాంక్షలు.
'శ్రీవాణి'

| | | | | | అక్టోబర్ | మే | ఫిబ్రవరి ఆగస్టు | మార్చి నవంబర్ | జూన్ | సెప్టెంబర్ డిసెంబర్ | జనవరి ఏప్రిల్ జూలై |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 8 | 15 | 22 | 29 | ఆది | సోమ | మంగ | బుధ | గురు | శుక్ర | శని |
| 2 | 9 | 16 | 23 | 30 | సోమ | మంగ | బుధ | గురు | శుక్ర | శని | ఆది |
| 3 | 10 | 17 | 24 | 31 | మంగ | బుధ | గురు | శుక్ర | శని | ఆది | సోమ |
| 4 | 11 | 18 | 25 | | బుధ | గురు | శుక్ర | శని | ఆది | సోమ | మంగ |
| 5 | 12 | 19 | 26 | | గురు | శుక్ర | శని | ఆది | సోమ | మంగ | బుధ |
| 6 | 13 | 20 | 27 | | శుక్ర | శని | ఆది | సోమ | మంగ | బుధ | గురు |
| 7 | 14 | 21 | 28 | | శని | ఆది | సోమ | మంగ | బుధ | గురు | శుక్ర |